## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 6020010001970

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# స్త్రీపై అత్యాచారాలు

మల్లాది సుబ్బమ్మ




మల్లాది పబ్లికేషన్సు
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహదీపట్నం,
హైదరాబాద్ - 500 028.

# స్త్రీలపై అత్యాచారాలు

## ఉపోద్ఘాతం

స్త్రీలపై అత్యాచారాల సంఖ్య పెరుగుతున్నదని కొందరు, పెరగటం లేదు కాని అవి వెలికి వస్తున్నందువల్ల సంఖ్యలో వృద్ధి ఉన్నట్లు కనపడుతున్నవని పత్రికలవారు మరికొందరూ వాదిస్తున్నారు. ఏదైనా ఒక విషయం మాత్రం సత్యం. ప్రతిరోజూ ఇలాంటి వార్తలను వినడం, చదవడం తటస్థిస్తున్నది. ఈనాటి సమాజంలో నీతి, ధర్మం నశిస్తున్నాయని సనాతనులు వాపోతుంటే, పాతకాలపు సంఘం కన్న యీనాటి సంఘం మెరుగయినదని వర్తమానాన్ని పొగిడేవారు ప్రకటిస్తున్నారు. అసలు నీతికి నిర్వచనం మారిందని ఒకవర్గమూ నీతి సార్వకాలికమూ, సార్వత్రికమూఅని మరో వర్గమూ మీమాంసకు దిగుతున్నాయి. ఈ తర్జన భర్జనలకు స్త్రీలపై అత్యాచారాలకు సంబంధమేమిటని విస్తుపోవటంకూడా సకృత్తుగా సంభవిస్తున్నది.

స్త్రీని వ్యక్తిత్వంలేని ప్రాణిగా ఈనాడు పలువురు భావిస్తున్నారు. ప్రాచీనకాలంలో స్త్రీ తండ్రియొక్క సొత్తు. తరువాత దానంపొందిన భర్త సొత్తు. మన వస్తువును మనం ఇతరులకు అమ్ముకోటానికి హక్కు ఉన్నట్లే ప్రాచీనకాలంలో కన్యను అమ్మటం జరిగేది. ఆమె ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా దానంచేయటం, పెండ్లిచేయటం పరిపాటి. అలాగే శత్రువుల స్త్రీలను చెరపట్టి స్వాధీనం చేసుకుని, ఇష్టమయితే తమ భార్యలుగానో లేక ఉంపుడుగత్తెలుగానో స్వీకరించటం ఆనవాయితీ. శత్రువుల భార్యలను చంపటం కూడా జరిగేది. ఇది ఆ సమాజంవారు అనుసరించే మతంతో నిమిత్తం లేకుండా సర్వే సర్వత్ర కొనసాగిన దారుణకాండ. ఈ దశలో స్త్రీ ప్రాణం ఉన్న వస్తువుక్రింద లెక్క. తరువాతిదశలో పరాయితెగ స్త్రీలను చెరబట్టి దాసీలుగా బానిసలుగా వాడటం మొదలయింది. రాణివాసంలో ఎంతమంది దాసీలు ఉంటే అంతగొప్ప. రాజులకు రాణులకు ఆ దాసీల మానప్రాణాలపై అడ్డూ అదుపూలేని అధికారం ఉండేది. తన భర్తతో పొత్తు లేక తను పొందు

కూడవలసిన పురుషుని సాంగత్యం తనకు ఇష్టంలేకపోతే దాసీని అతనివద్దకు పంపే అధికారం రాణులు చలాయించారు. ఇది హిందువులలోను జరిగింది; యూదులలోను సాగింది. ఇలాంటివి కోకొల్లలు. ప్రాచీన సమాజాల చరిత్ర నిండా కనిపిస్తాయి. ఇతిహాసాలు వీటి కథలతో నిండి ఉన్నాయి.

కాలం మారింది. స్త్రీని మనిషిగా గుర్తించారు. కాని ఆమె ద్వితీయ శ్రేణి మానుషి. పురుషుని ప్రతిభా వ్యుత్పత్తులను ఆమె ఏనాడు అధిగమించ లేదట. ఆమె పురుషుని ఆజ్ఞానువర్తియై సంచరించాలట. వివాహాత్పూర్వం తండ్రి, తరువాత భర్త, విధవయైనచో కుమారులు వీరంతా ఆమెకు యజమానులు. ఆమె వారి చెప్పుచేతల్లో జీవితం సాగించాలి. ఆమెకూ మెదడూ మనస్సూ ఉన్నా ఆమె వాటిని పురుషాధిక్య సమాజపు పరిధిలోనే వాడాలి; అంతేగాక పురుషుల ఉత్తరువులను అనుసరించి వారి అనుమతి మేరకు మాత్రమే వినియోగించాలి. అంటే ఇంచుమించుగా ఇది పరాధీనపు బ్రతుకు. ఈనాటి స్త్రీల స్థితి ఇది.

విషయచర్చలోకి దిగేముందు మరికొన్ని అంశాలను గుర్తుచేసుకోవాలి. మనదేశంలో భిన్నమతాలు, భాషలు, ఆచారాలు, సంప్రదాయాలు అమలులో ఉన్నాయి. అలాగే విభిన్న సామాజిక దశల రూపాలు మనకు దర్శనం ఇస్తున్నాయి. కేవలం నదీనదాలపై, సముద్రాలపై ఆధారపడి జీవయాత్ర గడిపే మత్స్యకారులు, అరణ్యసంపదను ఆసరాగా తీసుకొని జీవిక సాగించే గిరిజనులు, సంచారజాతులు, మైదానాల్లో, లోయల్లో వ్యవసాయం చేసే రైతు సంఘాలు, శ్రమశక్తి తప్ప నా అనేది లేక 'కూలి' డబ్బులకోసం పొట్ట చేత బట్టుకొని వేలమైళ్ళు దూరమైనా వలసపోయే వ్యవసాయ కార్మికులు, తమ శరీరబలాన్ని, బుద్ధిబలాన్ని అమ్ముకోటానికి సిద్ధపడి చివరకు యంత్రాలలోని చిన్న పనిముట్లమాదిరి వాటిలో అంతర్భాగమయ్యే పారిశ్రామిక కార్మికులు, పట్టణాలలో పెరుగుతున్న చిన్న దుకాణదారులు, బుద్ధిజీవులు వీరితోకూడిన మధ్యతరగతి ప్రజలు వీరందరూ మనదేశ జనాభాలో ఇమిడిఉన్నారు. వీరంతా తమ తమ వృత్తులను జీవిత విధానాలను అనుసరించి ఆచారాలను ఏర్పరుచుకున్నారు. అవి వందల ఏండ్ల తరబడి పాటింపబడటంతో ఘనీభవించి చివరకు సంప్రదాయాలుగా రూపొందాయి. ఈ సంప్రదాయాలు నీతిని నిర్దేశిస్తున్నాయి.

జీవిత వైఖరులను శాసిస్తున్నాయి. పరిసరాలు మానవజాతి ఆలోచనా రీతిని ప్రభావితం చేస్తాయి. అలాగే మనిషి భావాలు పరిసరాలను తారుమారు చేయగలవు. ఈ సత్యాన్ని మనం గుర్తిస్తే మనదేశంలో సమాజం ఒకరకంగా లేక ఎగుడుదిగుడుగా ఉంటున్నందు వల్ల వివిధ భావనా రీతులు మనుషుల మనోఫలకాలపై నృత్యం చేస్తున్నాయని తెలుస్తుంది. స్త్రీయెడల వైఖరికూడా ఒకరకమైన భావ సంచయమే కనుక వివిధ జాతులు, తెగలు, కులాలు, వర్గాలు స్త్రీని పరిగణించే విధానం భిన్నాతిభిన్నంగా ఉంటున్నది. మనదేశంలో ఒకేకాలంలో కాకపోతే భిన్నప్రాంతాలలో - ఆటవిక సమాజం, భూస్వామ్య సమాజం, వ్యాపార సమాజం, పారిశ్రామిక సమాజం అన్నీ గోచరం అవుతున్నాయి. అలా ఆయా సమాజాల భిన్న రీతుల నీతి చలామణిలో ఉంటున్నది. ఇచ్చట ఒక విషయాన్ని విస్మరించరాదు. భావాలు ఒకసారి పుట్టిన తరువాత అంత తేలికగా చావవు. మానవ సమాజ సభ్యుల మనస్సులలో అవి గట్టిగా పాదుచేసుకుంటాయి. దేశ రాజకీయార్థిక సామాజిక స్వరూపాలను మార్చినా పాతకాలపు భావాలు నశించక పౌరుల జీవితాలను ఆట పట్టిస్తుంటాయి ఈ వాస్తవాన్ని గమనించాడు కనుకనే, మావో 1966లో చైనాలో సాంస్కృతిక విప్లవాన్ని ప్రారంభించాడు. భావాలను భావాలతోనే ఎదుర్కోవాలని, అలా మాత్రమే వాటిని సంపూర్ణంగా నిర్మూలించగలమని గ్రహించవలసిన తరుణం ఆసన్నమయింది.

సమాజంలో స్త్రీయెడల భిన్న దృక్పథాలు ప్రాంతీయ భేదాన్నిబట్టి, కులమత వర్గ విభజనను అనుసరించి ఏర్పడతాయని తెలుసుకున్నాం. కాగా ఒకే మనిషిలో - ఎంత విద్యావంతుడయినా, పండితుడయినా ప్రాచీన భావ అవశేషాలు ప్రోది అయి ఉంటాయి. అంటే పాశ్చాత్యపద్ధతిలో వేషభాషలను అలవర్చుకొని సంస్కారిగా చలామణీ అవుతున్న మనిషిలో కూడా అనాగరిక ఆటవిక, భూస్వామ్య, బానిస సమాజపు భావాలు అప్పుడప్పుడు వెలికివస్తాయి. ఇక పారిశ్రామిక సంస్కృతిభావాల సంగతి సరేసరి. దానిలోనేకదా అతడు మనుగడ సాగిస్తున్నది.

పైన వివరించిన ఆలోచనాక్రమాన్ని అవగతం చేసుకుంటే 'ఆధునికులు'గా పరిగణింపబడేవారు కొందరు ప్రదర్శించే పశు ప్రవర్తన మనకు

సులభగ్రాహ్యమవుతుంది. లేని యెడల మనం ఆశ్చర్యంలో మునిగిపోయి ప్రధానాంశాన్ని పసిగట్టలేకపోతాం. మనిషి పాతకాలపు ప్రభావాన్నుంచి తేలికగా బయటపడలేదని చెప్పటానికి 'పాతకాలపు భావాలు నరనరాన అతనిలో జీర్ణించాయి' అంటాము. కనుక ఆధునిక మానవుడిలో కూడ ఆటవిక మానవుడు జీవించి ఉన్నాడన్నమాట. ఆధునిక కాలంలో జీవిస్తున్నంత మాత్రాన మనిషి ఆధునికుడు కాలేడు. ఆధునిక విలువలను తన స్వంతం చేసుకుంటేనే శిసలైన అసలైన ఆధునికుడు అవుతాడు. స్వేచ్ఛా సమానత్వ సౌభ్రాతృత్వ సిద్ధాంతాలపై నమ్మకం ఉండి, ప్రజాస్వామ్యంలో విశ్వాసం ఉండి, వ్యక్తి హుందాతనం, విలువ వీటిని గుర్తెరిగి, తోటి వ్యక్తియెడ సహృదయత, సానుభూతి, కరుణ, దయచూపగల మానసిక సంస్కారం కలిగి, తోటి వ్యక్తిని తన స్వప్రయోజనాలకోసం పనిముట్టుగా వాడుకునే పద్ధతిని విడనాడి, ప్రతివ్యక్తీ తన నైతిక ప్రవర్తనకు తానే బాధ్యుడనే సత్యాన్ని ఆకళింపు చేసుకొని, స్వేచ్ఛగా బాధ్యతాయుతంగా జీవించగలిగిన మానవ జీవియే ఆధునికతను అలవర్చుకున్నట్లు పరిగణించగలం. ఇలాంటి ఆధునికుల సంఖ్య సమాజంలో బహు స్వల్పంగా ఉంది. అధిక సంఖ్యాకుల భావనారీతులు స్త్రీని వ్యక్తిగత్వంగల మనిషిగా, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు హక్కుగల జీవిగా గుర్తించటంలేదు. అందువల్లనే స్త్రీలపై అత్యాచారాలు సాగిస్తూ సమాజంలో చాలమంది 'పెద్ద మనుష్యులుగా' చలామణీ అవుతున్నారు.

## అత్యాచారాల స్వరూప స్వభావాలు

అత్యాచారాలు అనేక రకాలు. 1) కేవలం శారీరక హింస, 2) పూర్తిగా మానసిక హింస, 3) శారీరక మానసిక హింసల సమ్మిశ్రితం. స్త్రీపురుషులు కొట్లాటల్లో పాల్గొంటే స్త్రీలకు కలిగే ఘాతలు, తగిలే దెబ్బలు శారీరక హింసక్రిందికి వస్తాయి. తతిమ్మా రెండింటిలో మానసిక హింస ప్రధానపాత్ర వహిస్తుంది. శారీరక హింసకన్నా మానసిక హింస మహిళను క్రుంగదీస్తుంది. సూటిపోటి మాటలద్వారా అనుక్షణం సాధించడం, తిట్టడం, తిరస్కరించడం, హావభావాలద్వారా న్యూనత పరచడం ఇవన్నీ మానసిక హింసలకు ప్రతీకలు. కొట్టడం, లైంగికంగా వేధించడం, మానభంగం, సజీవదహనం ఇవి మూడవ రకానికి చెందినవి. వీటిలో శారీరక మానసిక హింసలు చోటుచేసుకుంటాయి.

పీడితకు లోనుఅయిన స్త్రీ పరిస్థితిని గమనిద్దాం. తనను బాధించే పురుషునిదృష్టిలో తను కేవలం వస్తువునని, లేక బానిసనని, లేక రెండవరకపు మనిషినని ఆమె తలపోస్తుంది; అంతేగాక అతని కాముకతను తీర్చే లైంగికాకర్షణ కల్గిన జీవిగా అతడు తనను పరిగణిస్తున్నాడని భావిస్తుంది. ఈ స్పృహ ఆమెలో రెండురకాల స్పందనను కలుగజేయవచ్చు. తను నిజంగా తక్కువ మనిషినని తలంచి ఆత్మ న్యూనతాభావానికి లొంగిపోవడం ఒకటి. అలాకాక వ్యతిరేకించడానికి సిద్ధమవటం రెండవది. వ్యతిరేకించడం పలు విధాలుగా సాగించవచ్చు. 1) బాధించే పురుషుని చైతన్యయుతంగా ఎదుర్కొనటం, 2) అతని జీవితం నుండి తను వైతొలగిపోవటం. రెండవపద్ధతిలో మరల రెండు విధానాలు ఉన్నాయి. 1) బాధించే పురుషుడు భర్తఅయిన పక్షంలో అతని నుండి విడాకులు పొంది లేక కోర్టుద్వారా వేర్పాటు ఉత్తరువును పొంది లేక పొందకనో విడిగా జీవించడం. 2) ప్రాణత్యాగం చేయటం.

ఆత్మ న్యూనతాభావానికి లొంగిపోయిన మహిళ రెండురకాలుగా ప్రవర్తించడం చూస్తున్నాం. 1) భర్తకు లేక అత్యాచారం చేసిన పురుషునికి లొంగి పడిఉండటం. 2) తనపై జరిగిన అత్యాచారం వలన తను ఏదో మలినమయినట్లు, చెడిపోయినట్లు భావించుకొని తన ప్రాణాన్ని తీసుకొని తన జీవితాన్ని తన చేజేతుల నాశనం చేసుకోవడం.

ఈ అత్యాచారాలను పురుషపరంగా పరిశీలిస్తే కొన్ని వింత విశేషాలు తెలియ వస్తాయి. ఈ అత్యాచారాలను చేస్తున్న పురుషుల మానసిక స్థితి ఎలాంటిది? వారి ఉద్దేశ్యం ఏమిటి? వారు ఆశించేది ఏమిటి? వీరిలో చాలమంది మానసిక వ్యాధిగ్రస్తులు. పరపీడనవల్ల ఆత్మానందాన్ని పొందుతామని భ్రమసి సంచరించే మనుషులు. అవతలి వ్యక్తి ఎంతగా బాధపడుతుంటే, ఎంతగా వ్యథ చెందుతుంటే అంతగా సంతోషిస్తారు. దీనిని 'సాడిజం' అంటారు. మరొకరకం పురుషులకు స్త్రీజాతిపై ద్వేషము, పగ ఉంటాయి. వారి జీవితంలో వారు ఎవరో స్త్రీచేత అవమానింపబడి ఉంటారు. ఆ కసిని ఇలా ఇతరులపై తీర్చుకుంటారు. ఇంకా కొందరికి పురుషాధిక్యతా భావాలు ఉంటాయి. అందుచేత స్త్రీని లొంగతీసుకోవాలనే తలంపుతో హింసకు పూనుకుంటారు. మరొకరకం పురుషులకు ఇది ఒక ఆట; ఒక తమాషా. ఇతరులను

అల్లరిచేయడం సరదా. వారు సామాజిక బాధ్యత అంటే ఏమిటో తెలియని వారు. మరి వారు బాధకు గురిచేయటానికి స్త్రీలనే ఎందుకు ఎన్నుకుంటారు? సంప్రదాయసిద్ధంగా స్త్రీలు తాము అబలలమనే భావంతో ఎదురుతిరగరు కనుక ఎదురుదెబ్బ ప్రమాదం ఉండదు. అందుకే వారు స్త్రీలను తమ దుర్మార్గాలకు లక్ష్యాలుగా ఎంపికచేస్తారు.

ఇక స్త్రీలలో కూడ కొంతమంది విపరీత మనస్కులు లేకపోలేదు. వారికి హింసింపబడటం ఆనందదాయకం. ఇది ఒక మానసిక వ్యాధి. దీనిని 'మెసోకిజం' అంటారు. ఏనాడు భర్తచేత లేక మిండగానిచేత ఆమె తన్నులు తినదో ఆనాడు ఆమెకు సుఖంలేదు; ఆనందంలేదు. ఇలాంటి సంఘటనలను మనం ఎన్నో చూస్తున్నాం; ఇలాంటి కథలు ఎన్నో విన్నాం. ఎక్కువమంది స్త్రీలు హింసను ఆహ్వానించరు; సహించరు. కుమిలి కుమిలి కుంగిపోతారు. కొద్దిమంది మాత్రం ఎదురుతిరుగుతారు. స్త్రీలపై హింస అనేకవిధాలు. 1) భార్యలపై హింస, 2) లైంగిక వేధింపు, 3) మానభంగాలు, 4) అశ్లీల సాహిత్య ప్రచారం. వీటిని గురించి విడివిడిగా వివరంగా అధ్యయనం చేయవలసిన అవసరం ఉన్నది.

# భార్యలపై హింస

భర్తలు భార్యలను హింసించటమనేది ప్రపంచమంతటా సాగుతున్న దనేది నగ్నసత్యం. చాలా దేశాల్లో ఇలాంటి హింస తప్పనే భావం కూడా ప్రజల్లో వ్యాప్తి చెందడంలేదు. ముఖ్యంగా భారతదేశంలో భర్త భార్యను దండించవచ్చుననే అభిప్రాయం ప్రబలంగా ఉంది. ఒక కష్టజీవి తన భార్యను నడివీధిలో కొడ్తున్న సంఘటన తీసుకోండి దారినపోయేవారు అందరూ మనకేమని ఊరుకోలేరు కదా! కొంత మంది అతనిని మందలించ పూను కుంటారు. అప్పుడా భర్తకు ఎక్కడలేని కోపం వస్తుంది. "నా భార్యను నేను కొట్టుకుంటాను, తిట్టుకుంటాను, చంపుకుంటాను. నీవు ఎవడివి కలుగజేసు కోవటానికి'' అని కేకలు పెడ్తాడు. పోని ఆ స్త్రీ అయినా తన రక్షణకు వచ్చిన అతనిని సమర్థిస్తుందా? అలా జరగకపోగా ఆమె కూడా అతనిని నిరసిస్తుంది. ''ఏమయ్యా! మొగుడనేవాడు, నన్ను పోషించేవాడు అంత మాత్రం పెళ్ళాన్ని కొడితే తప్పా?'' అని ప్రశ్నించి అతన్ని ఘాటుగా అవ మానిస్తుంది. ఇది సర్వసాధారణంగా జరిగే సంఘటన. కాకపోతే మన దేశానికి ఇతర దేశాలకు ఉన్న తేడా అల్లా ఒకటే. అభివృద్ధి చెందిన దేశాలలో ప్రతి మంచి పనికీ, చెడ్డపనికి లెక్కలుంటాయి. వాటిని సేకరిస్తారు. వాటినిపరిశీలిస్తే సమస్యయొక్క అనుపానులు, గంభీరత మనకు అవగతం అవుతాయి.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశంగా పరిగణింపబడే అమెరికా న్యూయార్క్ రాష్ట్రంలో భర్తలు భార్యలను కొట్టి హింసించే కేసులు 14 వే దాకా కుటుంబతగాదాలు తీర్చే కోర్టుల ముందుకు వస్తున్నాయని స్త్రీవిమో చన ఉద్యమ కార్యకర్త డెల్‌మార్టినా ప్రకటించింది. భర్త భార్యను కొట్టడం తప్పని అచ్చటి ప్రజలు అందరూ ఇంకా భావించడం లేదట. అప్పుడప్పుడు భర్త భార్యను దండించవచ్చని చాలమంది అంటూ ఉంటారని, అది సహజ మనే భావన ప్రజలలో దట్టంగా వ్యాపించి ఉందని మెసాచ్యూట్స్ రాష్ట్ర శాసన సంస్కరణ సంస్థ అధిపతి శ్రీ అలన్ రోలర్స్ చెప్పాడు.

అమెరికాలో నివాసముంటున్న ఇండోచైనా శరణార్థులలో భార్యలపై భర్తలు చేయిచేసుకోవడం చాల హెచ్చుగా ఉంటుందట. పాశ్చాత్య సంస్కృతిని అలవరచుకున్న తెల్లజాతి పురుషులలోనే ఆ భావం – భార్యలను శారీరక హింసద్వారా దండించే అధికారం భర్తలకున్నదనే భావం – బలంగా చోటుచేసుకుంటే పాచ్యదేశాలనుండి వలస వచ్చిన వారి స్థితిని గురించి ఆశ్చర్య పడ నవసరం లేదు. ఇక అభివృద్ధి చెందుతున్న, చెందని దేశాల సంగతి చెప్పాల్సిన పని లేదు.

"అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఎప్పుడో ఒకప్పుడు భర్తచేతిలో దెబ్బలు తిన్న స్త్రీలు 100కి 50 మందికి పైగా ఉంటారు. అందులో 100కి 80 మంది తాము గర్భిణిగా ఉన్నప్పుడు హింసకు లోనయినారు" అని "ఈనాటి నడత" అనే పత్రిక పరిశోధనా వ్యాసంలో ప్రచురించింది. భారత దేశానికి లెక్కలులేవు. లెక్కలు తీయగలిగితే అలాంటి స్త్రీలు 100కి 80 మందికి పైనే ఉంటారు.

భార్యలను హింసించటం బీదవారిలో మాత్రమే జరుగుతుందని కొంత మంది భావిస్తుంటారు. అది పొరపాటు. హింసలకు లోనయిన స్త్రీలు అన్ని జీవితరంగాలకు చెంది ఉంటారు. అన్ని వర్గాలలోనూ ఉంటున్నారు. ప్రజలందరికి వారు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఒక వయస్సుకు, ఒక సామాజిక వర్గానికి, ఒక తెగకు, ఒక జాతికి మాత్రమేవారు పరిమితంగాలేరు. ఈఅంశం అన్ని దేశాలకూ వర్తిస్తుంది. భారతదేశంలో మరీ ఎక్కువగా కొట్టవచ్చినట్లు కన్పడుతుంది.

స్త్రీలకు తమ హక్కులేవో తెలియవు. తెలియని దశలో ఉంచరు పురుషులు. 99.8% అక్షరాస్యులయిన అమెరికాలో పరిస్థితి ఇలాగుంటే 2% స్త్రీలు మాత్రమే అక్షరాస్యులుగా ఉన్న భారతదేశ స్థితినిగురించి వేరే చెప్ప నవసరంలేదు. డిగ్రీచదువు ఉన్నంతమాత్రాన చాలదు. వివేకం కావాలి. ప్రపంచ జ్ఞానం కావాలి. ఇవన్నీ ఉన్నా సమాచార సేకరణ జరగాలి.అప్పుడే నారీలోకం చైతన్యవంతమవుతుంది. ఆనాడే తమను హింసించవూనే భర్తను ఎదిరించ గలుగుతారు భార్యలు. దీనికి సమష్టి ప్రయత్నం కూడా అవసరం. ఇది గ్రహించిన పాశ్చాత్యవనితలు బ్రిటనులో, అమెరికాలో భర్తల హింసకు

వ్యతిరేకంగా ఉద్యమాలు నడుపుతున్నారు. మనదేశంలో అలాంటి ఉద్యమం ఇంచుమించుగా శూన్యమని చెప్పవచ్చును. భర్తహింసకు తట్టుకోలేక భార్య కిరసనాయిలు పోసుకొని తన దేహానికి నిప్పంటించుకొని చస్తే, ఆ వార్త పత్రికలకు ఎక్కితే, ఆ నాలుగురోజులు ''అయ్యోపాపం'' అంటుంది తోటి నారీలోకం. తరువాత కొన్నాళ్ళకు మరచిపోతుంది. ఇదీ మనదేశపు వరస. కుటుంబంలో హింసకు వ్యతిరేకంగా అమెరికాలో 2వ జాతీయ మహాసభ 1982 ఆగస్టు నెలలో జరిగింది. ఈ సమస్యపై ప్రజల దృష్టిని ఆకర్షించింది ఆ మహాసభ. శరణాలయాలు, రక్షితగృహాలు, పిల్లలకు సహాయ పథకాలు, శరణాలయంలో ఆవాసం తదుపరి కార్యక్రమాలు, హింసకు పాల్గొనే పురుషుల మనస్తత్వాన్ని మార్చే ప్రయత్నాలు, వాటికి పథకాలు, స్త్రీల సంఘటన, నాయకత్వ శిక్షణ, సంఘాల సిబ్బంది సమస్య, స్త్రీలపై హింసయెడల సామాజిక దృష్టిని మార్చడం, శాసనాలు ఇచ్చే పరిహారం, సహాయం, కార్యకర్తల కలసికట్టుగా పనిచేయగల నేర్పు-ఓర్పు, ఇలా ఎన్నో సమస్యలను గురించి చర్చించింది ఆ మహాసభ. ఇటీవల 1980లో బొంబాయిలో జరిగిన జాతీయ మహాసభ తప్ప మరే స్త్రీల మహాసభ భారతదేశంలో ఈ సమస్యను పట్టించుకోలేదు. వారూ అమెరికను మహాసభ స్థాయిలో సమస్యను లోతుగా అర్థం చేసుకోలేదు. కాకపోతే అసలు లేనిదానికన్నా కొంతనయం. సమస్యను కొంత మంది కార్యకర్తల దృష్టికైనా తేవడం జరిగింది. ఇది ముదావహం.

భారతదేశంలో మహిళోద్యమాలు సాగాయి; సాగుతున్నాయి. మహిళా సంఘాలు ఒకటికాదు. అయిదు ఆరు వరకూ జాతీయ స్థాయిలో ఉన్నాయి. రాజకీయ వైఖరులదృష్ట్యా మహిళోద్యమం చీలింది. నిర్మాణం అలాగే జరుగుతున్నది. ఇది రాజకీయంగా వచ్చిన చీలిక అని ఎవరూ చెప్పరు. కాని అందరు కార్యకర్తలకూ తెలుసు. ఏదైనా మంచిపని చేసే సందర్భంగా అన్ని సంఘాలు ఒకరితో మరొకరు పోటీపడవచ్చు కదా! అలా జరగటం లేదు. కారణాలు అనేకం. సమస్య అవగాహనం కాకకాదు. వనరులు, ముఖ్యంగా మానవ వనరులు, లేక ఆ పని కుంటుపడుతున్నది. తమ తమ రాజకీయాలకు అనుగుణంగా స్త్రీలను ఎలా సమీకరించాలో అనేది వారి దృష్టిని ఎక్కువగా ఆకట్టుకుంటున్నది. కాస్తోకూస్తో ఆసక్తి ఉన్న కార్యకర్తలకు తగిన పాండిత్యం శిక్షణ' దక్షతలేవు.

మరొక విషయాన్ని గమనించాలి. చెదురుమదురుగా ఏవో కొన్ని మహిళా సంఘాలు ఈ సమస్యను పట్టించుకున్నాయనుకోండి. అవి తమ సమష్టి అనుభవాలను ఒకచోట చేర్చి ఏకాగ్రతతో పట్టుదలతో సమస్య అవగాహనకు ప్రయత్నించడం లేదు. ఏదయినా సమస్యను తీసుకొని ఆ సమస్యపై ఆసక్తి కల వారందరూ తలపట్లు పట్టుకోవడం భారతీయ స్త్రీలు ఇంకా గట్టిగా అలవరుచుకోలేదు. ఇది శోచనీయం. అందువలననే సమస్యలు ఎంతగానో ఎన్నో ఉన్నా కనుమరుగవుతున్నాయి. ప్రజలూ, ప్రభుత్వాలూ వీటి విషయమై పట్టించుకునే అవకాశాలు సన్నగిల్లుతున్నాయి.

హింసకు లోనయిన స్త్రీలకు మార్గాంతరాలు తెలియవు. హింసకు ఎదురుతిరిగినా, హింసను తప్పించుకోదలచినా ఏం చేయాలనేది వారికి పెద్ద సమస్యగా తయారయింది. ఒకసారి ఇల్లు కదిలితే పరల ఇంటికి రానీడు భర్త. బయటికి వెళ్ళినా ఎవరు ఆదరిస్తారు? కన్నవారు ఆదరించరు భారతదేశంలో. 'భర్తతోడిదే నీ జీవితం. బ్రతికినా చచ్చినా అత్తింటనే ఉండాలి నీవు' అంటారు తల్లిదండ్రులు. అన్నతమ్ముల విషయం మరి చెప్పనక్కరలేదు. ఇక బ్రిటను అమెరికాలో సమష్టి కుటుంబ జీవనం లేదు. ఎవరి కుటుంబం వారిదే. కూతురును ఆదుకునే తల్లిదండ్రులు ఇంచుమించుగా లేనట్లే. కనుకనే శరణాలయాల ఆవశ్యకత ఎంతో ఉంది. అర్ధరాత్రి భార్యను కొట్టి మెడపెట్టి భర్త గెంటివేశాడనుకోండి; లేక అత్త, మామ, ఆడపిడ్డ ఆమెను చావగొట్టారనుకోండి: కాకపోయినా ఆ హింసకు తట్టుకోలేక ఆమె ఇల్లు వదలిపెట్టి పారిపోదామని నిశ్చయించిందనుకోండి, ఆమె ఎక్కడికి పోవాలి? ఎవరిస్తారు ఆశ్రయం? ఆశ్రయం దొరికినా ఎలా బ్రతకాలి? తనకు ఏ వృత్తి చేతకాదే సతీత్వం తప్ప! అసలు ఆ మాటకువస్తే ఎన్ని నగరాలలో అలాంటి శరణాలయాలు ఉన్నాయి? వాటిని చేరేలోగా మార్గమధ్యంలో ఆమెకు రౌడీలు, పడుపు గృహాలు నిర్వహించే దుర్నీతిపరులు ఎదురవుతారు. వీరి నుండి రక్షణ ఎలా? ఇవన్నీ సమస్యలు. అసలు ఆ మాటకు వస్తే భారతదేశంలో ఎన్ని శరణాలయాలు ఉన్నాయి? ప్రభుత్వం నడిపేవి తప్ప దేశం మొత్తంలో ఢిల్లీలో సహయోగ్ కేంద్రం ఒకటి ఉంది. వారు గత 15 నె.లలో 8 మందికి సహాయం చేశారట. పాశ్చాత్య ప్రపంచంతో పోలిస్తే మన కృషి అత్యాతి అల్పం. బ్రిటనులో జాతీయ స్త్రీ సహాయ ఫెడరేషను 200 శరణాలయ కేంద్రాలు నడుపుతున్నది. అమెరికాలో

225 శరణాలయాలు ఉన్నాయి. బ్రిటిష పార్లమెంటు సెలెక్టు కమిటీ ప్రతి 10 వేల జనాభాకు ఒక స్త్రీల శరణాలయం ఉండాలని సిఫారసు చేసింది. ఆ సిఫారసు అయినా 5 ఏళ్లకు. బ్రిటన్‌లో ప్రతి 60 వేలమంది జనాభాకు ఒక కేంద్రం మాత్రం ఏర్పడింది. వాటిలో శరణార్థుల సంఖ్య ఎక్కువ. వసరులు తక్కువ. అవి ఆర్థికంగా పటిష్టంగా లేవు. ఇక భారతదేశ పరిస్థితిని గురించి మరి వేరే చెప్పనక్కరలేదు. శరణాలయాలు ఉంటే కుటుంబ విచ్ఛిత్తి జరుగుతుందని, భారత సంస్కృతికి విలక్షణమైన కుటుంబ జీవనం దెబ్బ తింటుందని చాల మంది భయపడుతున్నారు; సంకోచిస్తారు ఇలాంటి ప్రయత్నాలను బలపరచటానికి. కాని ఒక్క విషయం గమనించాలి. ఇంట్లో నుంచి బయటికి వెళ్ళిపోతానని భార్య బెదిరించగలిగేనాడు – ఆ బెదిరింపు ఆచరణలోకి రాగల అవకాశం ఉండాలి——హింసకు పూనుకునే భర్తలు భయపడతారు. ఆమె వాడేయవలసిన అవసరం లేదు. బుసకొట్టే చాలు. దుర్మార్గ ప్రవృత్తిలో ఉండే భర్తలు భయపడతారు. వారూ మార్చుకుంటారు తమ నడతను. అది వారికీ, దేశానికీ, సమాజానికీ, అందరికీ మంచిది. కనుక శరణాలయాలు కావాలి.

మనదేశంలో శరణాలయాల సంఖ్య తక్కువ. ఉదాహరణకు ఆరుకోట్ల ఆంధ్రులకు ముఖ్యపట్టణమైన హైదరాబాద్‌లో ప్రభుత్వంవారు నడిపే శరణాలయాలు రెండు. స్వచ్ఛంద సంస్థలు నడిపేవి మరి రెండో మూడోఉన్నాయి. ఈ కొద్దిపాటి శరణాలయాలు ఇచ్చే సౌకర్యాలను కూడా వాడుకోలేని దుర్గతిలో ఉన్నది సమాజం. వాటి అవసరం లేక కాదు. వాటి అవసరాన్ని గ్రహించక కాదు. ఇబ్బందులు వచ్చినా వాటిలో చేరకపోవటానికి కారణాలు అనేకం. 1) ప్రభుత్వాలు నడిపే శరణాలయాల నియమ నిబంధనలకు భర్తలచేత హింసింపబడిన స్త్రీలు తట్టుకోలేక పోవటం. అవి ఇంచుమించుగా జైళ్ళని వారు భావించడం. 2) ఇక స్వచ్ఛంద సంస్థలు నడిపే సంస్థలలో అక్కడ ఉన్న వారిని ఎంతో బాగా చూసుకుంటున్నా, వనరులు ఎక్కువగా లేకపోవడంవల్ల సౌకర్యాలు కొంచెం తక్కువగా ఉండడం. 3) అంతేగాక ఆ శరణాలయాలు సమాజంలోని అన్ని వర్గాలవారికి ఆశ్రయం ఇవ్వడం మూలాన, కొంతమంది తాము సంపన్నులు కాక పోయినా తాము సంపన్నులమనే భ్రమలో మునిగి భ్రాంతిమయ జీవితాన్ని సాగించే మధ్యతరగతి స్త్రీలు వాటిలో చేరడానికి

సంకోచించడం. 4) వాటికి ఆర్థిక వనరులు తక్కువగా ఉన్నందున భద్రత విషయమై గట్టి బందోబస్తును ఏర్పాటు చేయలేకపోవడం అంటే దానికి అవసరమగు కాపలా మనుషులను నియమించలేక పోవటం. ఢిల్లీలాంటి మహా నగరంలో - ప్రతిరోజూ ఒకటి రెండు వరకట్న మరణాలు సంభవిస్తున్న నగరంలో - ఒక స్వచ్ఛంద సంస్థ ఇచ్చే ఆశ్రయాన్ని సంవత్సరానికి 14 మంది మాత్రమే పుచ్చుకున్నారంటే సమస్యలోని చిక్కులు అవగత మవుతాయి.

హింసింపబడే స్త్రీలు ఉన్నారంటే హింసించే పురుషులు ఉన్నారన్న మాట. తమ పరిస్థితి ఏమిటో, తమ హక్కులేమిటో సరిగా తెలియని స్త్రీలు, హింసలకు లోనయికూడా, ఎదిరించటానికి భయపడుతున్నారు. స్త్రీలకు సలహా లిచ్చే ప్లీడర్లు, డాక్టర్లు, తగాదాపడమని వారికి సలహాలనివ్వరు. హింసను ఎదుర్కొనే రెండు శక్తులు సరిసమానంగా లేనప్పుడు తటస్థంగా ఉండట మంటే బలంగల శక్తిని బలపరచడమేనని రస్సెల్ దోబాష్ అన్నమాట నిజం. బ్రిటన్‌లోని లాయర్లను ఉద్దేశించి, 'గార్డియను పత్రిక చేసిన వ్యాఖ్యానం ఇది. హింసించే భర్తలపై బ్రిటనులో కోర్టులు భార్య నివసించే ఇంటికి రావద్దని నిషేధపు ఉత్తరువులు ఇస్తున్నాయి. కాని వాటిని ఆ భర్తలు పాటించటం లేదు. వాటిని స్థానిక కౌన్సిళ్ళు అమలుపరచటం లేదు అలాంటి భర్తలను పోలీసులు అరెస్టు చెయ్యాలి. అంతేగాక వేరుగా ఉంటున్న భార్యల ఇండ్లలో అలారం ఏర్పాటు చేయాలి. దౌర్జన్య పరుడయిన భర్త ఆమెపై అత్యాచారం చేయడానికి ఆమె ఇంటికి రాగానే ఆమె మీట నొక్కితే పోలీసు స్టేషనులో అలారం మోగాలి; అప్పుడు పోలీసులు రావాలి. అలాగయితేనే ఆమెకు సహాయం సకాలంలో అందుతుందని 'గార్డియను' పత్రిక సూచన చేసింది. అంతేగాక ఆమెకు ఇతరత్రా సదుపాయాలు కల్పించాలి. ఉదాహర ణకు భర్త హింసను భరించలేక అతని ఇంటిలో కాపురం చేయలేని భార్య వేరే కాపురం ఉండేనిమిత్తం మరో ఇంటికోసం స్థానిక మ్యునిసిపలు కౌన్సిలుకు దరఖాస్తు చేస్తే ఆమెకు ఇల్లును కేటాయించడానికి - అద్దెకే అనుకోండి - కౌన్సిలు సంసిద్ధతను చూపాలి. ఇది బ్రిటనులోని మహిళోద్యమ డిమాండు.

మనదేశంలో కోర్టుద్వారా వేరు పడిగాని, లేక విడాకులు పొంది గాని విడిగా ఉంటున్న స్త్రీకి రక్షణలేదు. భర్త లేక మాజీభర్త నెల

కొకసారి ఆమె ఇంటికి వచ్చి రౌడీ మామూలులాగా ఆమె జీతంలో కొంత భాగాన్ని తీసుకొని వెళ్తున్న సంఘటనలు అనేకం. కాదంటే తంతానంటాడు; కొట్టానంటాడు. కత్తి చూపిస్తాడు; హత్య చేస్తానని బెదిరిస్తాడు. ఆమెకు సాయంవచ్చే ఇరుగు పొరుగూ కనపడరు. ఆమెను ఆదుకునే మహిళాసంఘాలు లేవు. పోలీసులకు రిపోర్టు ఇస్తే ఒకటి రెండుసార్లు భర్తను లేక మాజీభర్తను మందలిస్తారు; హెచ్చరిస్తారు. అంతే తరువాత అంతా షరా మామూలే. మరో సారి పోలీసులదగ్గరకు వెళ్తే ఆ స్త్రీని వారు నానా మాటలతో అపహాస్యం చేస్తూ మాట్లాడి ఆమెకు సాయం చేయటానికి రారు. వారి మాటల తీరు అసహ్యంగా ఉంటుంది. ''చూడమ్మా భర్తలచేత హింసింపబడే స్త్రీలు ఈ ఊళ్ళో వేలమంది వున్నారు. అలాంటి ప్రతి స్త్రీని మేము కాపాడాలంటే మా సంఖ్య చాలదు. పైగా మాకు ప్రభుత్వం సవాలక్ష విధులను కేటాయించింది. మీలాంటి స్త్రీలను ఆదుకుంటూ కూర్చుంటే మాకు తతిమ్మా పనులు సాగవు. అయినా, ఒక్కమాట. భర్తను మంచి మాటలతో భార్య లొంగదీసుకోవాలి. కాని పోలీసుల సాయాన్ని మాటిమాటికీ కోరడం మాత్రం ఏమి సబబు?'' ఈ ఎగతాళి, వ్యంగ్యం, 'హితవచనం' ఆ స్త్రీని కుంగతీస్తాయి. ఆమెకు రెండే రెండు మార్గాలు. ఒకటి తన భర్త లేక మాజీభర్తకు లొంగిపోయి మామూలు చెల్లించటం లేక అన్నింటికీ తెగించి ప్రాణాపాయం కలుగుతుందని తెలిసినా అతనిని అన్నివిధాలా - కోర్టుద్వారా లేక తను ఆత్మరక్షణోపాయాలను వెదికి, అనుసరించి - ప్రతిఘటించడం. చాలమంది స్త్రీలు లొంగిపోయి భర్తలకు, మాజీ భర్తలకు భయపడుతూ జీవిస్తుంటారు. వారికి అండదండలు ఇవ్వని సమాజం మనది.

శరణాలయాల్లో, విడిగా జీవిస్తున్న స్త్రీల ఇండ్లలో మీటలు నొక్కితే పోలీసు స్టేషనులలో గంటలు మోగే ఏర్పాటు కావాలని బ్రిటిష ప్రజల ఆలోచన. అలాంటి ఏర్పాటుచేస్తే నిస్సహాయులుగా ఉన్న స్త్రీలను పోలీసువారు ఆదుకోవటం పోయి వారే ఆమెపై అత్యాచారానికి దిగే ప్రమాదం ఉన్నది మనదేశంలో. పోలీసు బలగమంతా చెడ్డదని చెప్పటంలేదు. పోలీసు బలగంలో అవాంఛనీయ శక్తులు చేరాయని, వారిలో కొంతమంది సమాజ వ్యతిరేక భావాలు కలవారు ఉన్నారని చెప్పటయే రచయిత ఉద్దేశం. కడివెడు పాలలో ఒక్క

విషపు చుక్క వేస్తే పాలన్నీ చెడిపోయినట్లు కొద్దిమంది దుర్మార్గులు పోలీసు బలగంలో స్థానం సంపాదించుకున్నందువల్ల పోలీసులందరికీ చెడ్డ పేరు వస్తున్నది.

పీడిత భార్యలకు సహాయం చేయడానికి బ్రిటనులో, అమెరికాలో అనేక శాసనాలు ఉన్నాయి. కుటుంబ కోర్టులకు విస్తృతాధికారాలు ఇచ్చారు. అమెరికాలోని న్యూయార్కు రాష్ట్ర శాసనసభ ఇటీవల కుటుంబ కోర్టుల శాసనాన్ని సవరించింది. అది గమనార్హం. అంతకు పూర్వం భార్య భర్తల మధ్య తగాదా వచ్చినపుడు రాజీచేయడం, అంతగా కాకపోతే విడాకులివ్వటం, పిల్లల రక్షణ పోషణ విషయాలపై నిర్ణయాలు చేయడం ఆ కోర్టుల పని. ఇపుడు శాసనంయొక్క ఉద్దేశాలలో 'హింసను ఆపుట, హింసకు లోనయిన వారికి సహాయం చేయుట' అనే రెండు అంశాలను చేర్చింది సవరణ. ఈనాటి శాసనం ప్రకారం భార్యకు రక్షణ వచ్చింది. అంతేకాదు వివాహం అనే తంతు లేకుండా ఒక పురుషునితో దాంపత్య జీవితం గడిపే స్త్రీకికూడా రక్షణ కలిగింది. ఇది విశేషం. ఎందుకంటే ఇటీవల అమెరికాలో వివాహం అనే తంతు లేకుండా కాపురాలు చేయడం జాస్తి అయింది. ఈ తంతు ప్రాముఖ్యతను ప్రశ్నిస్తున్నారు చాలమంది. ఇది ఒక ఆలోచనా ధోరణి; ఒక జీవిత విధానం. ఏదైనా హింసకు లోనయిన స్త్రీ - లా ప్రకారం భార్య అయినా, కాకపోయినా భార్యగా సంచరించినన్నాళ్ళు - ఆమెకు రక్షణ ఇవ్వడం అవసరం; వాస్తవాన్ని గుర్తించే పద్ధతి అది. ఆ శాసనం ప్రకారం కేసులో ఇలా క్రమం వుంటుంది. అలాంటి స్త్రీకి ఉచిత న్యాయసలహా, సహాయమూ ఉంటాయి. ఆమె కోర్టుకు వస్తే, న్యాయమూర్తి విధిగా ఆ రోజుననే ఆమెను చూడాలి. తన కేసుయొక్క నిజాన్ని, న్యాయాన్ని గూర్చి ఆమె న్యాయమూర్తికి నచ్చచెప్పగలిగితే ఆమె రక్షణకు వెన్వెంటనే న్యాయమూర్తి ఉత్తరువు ఇస్తారు. తరువాత భర్తకు లేక ఆమె భర్తలాగా ప్రవర్తించే పురుషునికి నోటీసు పోతుంది. తరువాత విచారణ మొదలవుతుంది. త్రాగవద్దని, ఆమెను కొట్టవద్దని, ఇంటికి దూరంగా ఉండమని అలాంటి ఉత్తరువులను జారీచేస్తుంది కోర్టు. వాటిని ధిక్కరిస్తే అరెస్టు చేయిస్తుంది. ఇలాంటి శాసనం భారతదేశంలో లేదు. మనకు అసలు కుటుంబ కోర్టులు లేవు. మామూలు సివిలు కోర్టులే వివాహ సంబంధమైన కేసులను విచారిస్తాయి. వాటికి భార్యాభర్తల తగవులను పరిష్కరించి రాజీచేయగల

ఓర్పూ, నేర్పూ లేవు. అంతగా రాజీ కుదరకపోతే, పిలుస్తే - చట్టం సమ్మతిస్తే - విడాకులివ్వటం తప్ప ఆ కోర్టులకు మరే అధికారాలు లేవు. ఈ విషయంలో మనదేశం ఎంతో వెనుకబడి ఉంది. శ్రీమతి హోదా కమిటీవారు కుటుంబ కోర్టులను నెలకొల్పమని 1975లో సిఫారసు చేశారు. ఇన్ని సంవత్సరాలకు అంటే పదేండ్ల తర్వాత కుటుంబ న్యాయస్థానాలు నెలకొల్పాలని ప్రభుత్వం శ్రద్ధ చూపుతున్నది. ఓట్టిదిపరకు అది 1984 సెప్టెంబరులో కార్యరూపం దాల్చింది. చట్టం రావడం వేరు. అమలుపర్చడం వేరు.

## కుటుంబ న్యాయస్థానాల శాసనం

ఈ శాసనం 1984లో పార్లమెంటుచేత ఆమోదింపబడి ది. 14.9.84న భారత అధ్యక్షుని సమ్మతిని పడసినది. ఇది 1984లో ఆమోదింపబడిన 66వ శాసనం. ఇది జమ్మూ-కాశ్మీరు రాష్ట్రానికి తప్ప ఇండియాకు అంతటికి వర్తిస్తుంది. ఇది కేంద్ర ప్రభుత్వం వారు నిర్ణయించిన తేదీన అమలులోకి వస్తుంది. వేరు వేరు అమలు తేదీలను కేంద్ర ప్రభుత్వం నిర్ణయించవచ్చును. ఈ శాసనం ఇంకా ఆంధ్రప్రదేశ్‌లో అమలులోకి రాలేదు.

ఈ శాసనపు రెండవ అధ్యాయం కుటుంబ న్యాయస్థానాలను, 3వ అధ్యాయం వాటి అధికారాలను, 4వ అధ్యాయం వాటిలో విచారణ విధానాన్ని, 5వ అధ్యాయం అపీళ్ళు తప్పీళ్ళను, 6వ అధ్యాయం శాసనం క్రింద ప్రభుత్వాదులు ఏర్పరిచే నిబంధనలను గురించి చెప్తున్నాయి.

హైకోర్టును సంప్రదించి రాష్ట్ర ప్రభుత్వం కుటుంబ న్యాయస్థానాలను నెలకొల్పవచ్చును. 10 లక్షలకు పైగా జనాభా ఉన్న పట్టణాలలో నగరాలలో ప్రతి ఒక్కదానికి ఒక్క కుటుంబ కోర్టును నెలకొల్ప వచ్చును. అలాగే రాష్ట్రంలో ఇతర ప్రాంతాలలో కుటుంబ కోర్టులను ఏర్పరచ వచ్చును. కుటుంబ కోర్టులో ఒకరిని కాని ఇంకా మరికొంతమందిని కాని హైకోర్టు అంగీకారంతో న్యాయమూర్తులుగా రాష్ట్ర ప్రభుత్వం నియమించవచ్చును. ఆ కోర్టులలో ప్రధాన న్యాయమూర్తి లేక అదనపు ప్రధాన న్యాయమూర్తిని రాష్ట్ర ప్రభుత్వం హైకోర్టు అంగీకారంతో నియమించ గలదు. జడ్జీగా లేక ట్రిబ్యునలు సభ్యుడుగా లేక రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలలో న్యాయసూత్రాలను

తెలిసికోవలసిన అవసరం ఉన్న ఏ ఉద్యోగమైనా ఏడు సంవత్సరములు చేసిన వ్యక్తి కుటుంబ కోర్టులో న్యాయమూర్తిగా నియమింపబడటానికి అర్హుడు. హైకోర్టులో 7 సంవత్సరములు న్యాయవాదిగా పనిచేసిన వ్యక్తి, భారత ప్రధాన న్యాయమూర్తి అంగీకారంతో కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన మరేదైనా యోగ్యతా లక్షణాలు కల్గిన ఏ వ్యక్తియైనా ఈ జడ్జి ఉద్యోగానికి అర్హులు. న్యాయమూర్తులను నియమించటంలో ఈ దిగువ అంశాలకు ప్రాధాన్యత ఇవ్వ వలెను. కుటుంబ వ్యవస్థను రక్షించటానికి, కొనసాగించటానికి కృత నిశ్చయులుగా ఉండాలి. బాలబాలికల సంక్షేమాన్ని పెంపొందించడానికి అంకితమయి ఉండాలి. కుటుంబ తగాదాలను తీర్చడంలో, పార్టీలమధ్య సమాధానము కుదర్చడంలో తమ అనుభవం వలననూ, నేర్పరితనము వలననూ శక్తి యుక్తులు కలిగి తగినవారుగా ఉండాలి. స్త్రీలను నియమించడానికి ప్రభుత్వాలు అత్యధిక శ్రద్ధ చూపించాలి. 62 సంవత్సరాలు నిండినవారు జడ్జీలుగా పనికి రారు. సాంఘిక సంక్షేమానికి కృషిచేసే సంస్థలు, వారి ప్రతినిధులు, కుటుంబ సంక్షేమాన్ని పెంపొందించడంలో వృత్తిపరమైన నైపుణ్యం సంపాదించిన వారు, సాంఘిక సంక్షేమ రంగంలో పనిచేసే ఇతర వ్యక్తులు లేక, కుటుంబ కోర్టుకు సహాయం చేయగల ఇతరులు వీరికి కుటుంబ కోర్టుతో సంబంధం కలుగజేస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తరువులు ఇవ్వవచ్చును. అలాగే హైకోర్టు సలహాను పొంది కుటుంబ కోర్టుకు సహాయపడే కుటుంబ సలహాదార్ల సంఖ్యను వారిలో వివిధ తరగతులను రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించగలదు.

ఈ దిగువ ఉటంకించబడిన వ్యాజ్య గ్రంధములన్నీ కుటుంబ కోర్టు పరిధిలోకి వస్తాయి. వివాహం రద్దుచేయుటకు, రద్దు అయినదని ప్రకటించుటకు, కాపురానికి రమ్మనమనే పిటీషన్లు, భార్యాభర్తలలో ఒకరు రెండవవారి నుండి వేరుగా ఉండటానికి అనుమతిని కోరే పిటీషన్లు, వ్యాజ్యాలు, ఒక వ్యక్తి యొక్క వైవాహిక హోదాను ప్రకటించమని లేక వివాహం చెల్లతగినదని ప్రకటించమని కోరే పిటీషన్లు, వ్యాజ్యాలు, ఏ ఒకరి లేక ఇరువురి ఆస్తులను గురించిన తగాదాలు, వైవాహిక సంబంధం విషయంగా ఒకరికి వ్యతిరేకంగా మరొకరికి అనుగుణంగా ఇచ్చే నిషేధపుటుత్తరువులకు సంబంధించినవి, ఒక వ్యక్తి సక్రమ సంతానమనియో లేక అక్రమ సంతానమనియో నిర్ణయించ

కోరే అభ్యర్థనలు, మనవర్తి సంబంధమైన వ్యాజ్యాలు, మైనర్ల రక్షణ కై వారి ఆస్తుల రక్షణకై సంరక్షణాకర్త (Guardian) నియామకం వంటి అన్నింటినీ కుటుంబ కోర్టువారు విచారించ అర్హులు. మనవర్తి విషయమై ఇప్పుడు క్రిమినలు కోర్టు వారికి ఉన్న అధికారాలు కుటుంబ కోర్టుకు చెందుతాయి.

ప్రతి రాజ్యంలో భార్యా భర్తల మధ్య సామరస్య సాధనకు కోర్టువారు భార్యాభర్తలను పరిస్థితులను బట్టి ప్రోత్సహిస్తారు. తగాదా పరిష్కారమవుతుందనే భావం సహేతుకంగా కలిగితే అలాంటి ప్రయత్నాలు జరిపించే నిమిత్తం కోర్టువారు వ్యాజ్యాన్ని వాయిదా వేయవచ్చును.

మామూలుగా సివిలు కోర్టు విధానం అమలు పరుస్తుంది. కుటుంబ కోర్టు క్రిమినలు ప్రోసీజరు కోడ్ క్రింద వచ్చే మనవర్తి లాంటి వ్యవహారాల్లో క్రిమినలు కోర్టు విధానం అనుసరింప బడుతుంది. కోర్టులో విచారణ రహస్యంగా జరుగుతుంది. తన విధ్యుక్త ధర్మ నిర్వహణలో కుటుంబ కోర్టు వైద్య నిపుణుని, లేక పార్టీలకు బంధువయిన వ్యక్తిని కాకపోయినవ్యక్తిని, లేక కుటుంబ సంక్షేమం విషయంలో వృత్తి ప్రావీణ్యత పొందిన వ్యక్తిని అందులో ముఖ్యంగా వీలయినంత వరకు స్త్రీని తనకు సహాయం చెయ్యమని కోరవచ్చును.

కుటుంబ కోర్టులలో మామూలుగా న్యాయ వాదులకు స్థానం లేదు కాగా న్యాయ నిర్వహణకు అవసరమని కోర్టు వారికి తోస్తే కోర్టు వారు ప్లీడరు యొక్క సహాయాన్ని పొందగలరు. సాక్షి వాఙ్మూలాన్ని యథాతథంగా కోర్టువారు వ్రాసుకోనక్కర లేదు. సాక్షి చెప్పిన విషయాన్ని సంగ్రహంగా నమోదు చేసుకోవచ్చును. పార్టీలు ప్రమాణ పత్రాలను కూడా దాఖలు చేయవచ్చును. కోర్టు తీర్పును సివిలు కోర్టు తీర్పులాగా అమలు పరచవచ్చును. క్రిమినల్ ప్రోసీజరు కోడు క్రింద కేసు అయితే ఆ శాసనం ప్రకారం అమలు పరచ వచ్చును.

పార్టీల సమ్మతిపై ఆధారపడి ఇవ్వబడిన తీర్పుపై అపీలు లేదు. కుటుంబ కోర్టు తీర్పుపై హైకోర్టు అపీలు ఉన్నది. దానిని ఇద్దరికి తక్కువ లేకుండా ఉన్న హైకోర్టు ధర్మాసనం మాత్రమే విచారించ గలదు.

కుటుంబ కోర్టులు పనిచేసే తీరును గురించి హైకోర్టు నిబంధనలను రూపొందించగలదు. న్యాయమూర్తుల నియామకం విషయమై అర్హతలను నిర్ణయించటానికి కేంద్ర ప్రభుత్వం నియమాలను తయారు చేయగలదు. ఫీజులు, జీతాలు, వేతనాలు నిర్ణయించే పని రాష్ట్ర ప్రభుత్వానిది.

ఈ శాసనం చాల లోపభూయిష్టమైనది, ప్రతి కుటుంబ కోర్టులో విధిగా స్త్రీ న్యాయమూర్తిగా ఉండాలని, సలహాదారుగా నియమింపబడాలని శాసనం చేసి ఉండవలసినది. హైకోర్టుకు అపీలు హక్కు ఇచ్చినందు వలనను, ఇరువురు న్యాయమూర్తులున్న ధర్మాసనమే అపీలును విచారించాలన్నందు వలన వ్యాజ్యాలు త్వరగా పరిష్కారం కావు. రాష్ట్రాలలో శాసనం అమలు పరిచే తేదీలను కేంద్ర ప్రభుత్వం నిర్ణయిస్తుందని వ్రాయటం వలన ఈ శాసనం రాజకీయ గాలి దుమారంలో ఇరుక్కొని పని జరగక పోయే ప్రమాదం హెచ్చుగా ఉంది. బ్రిటను లాంటి దేశంలో శాసనం ఎడ గౌరవం ఉన్నది. భార్యను హింసించే భర్తపై ఆంక్షలు విధిస్తాయి కోర్టులు. వాటిని పాటిస్తారు 100కి 98 మంది భర్తలు. పుష్టుడు కూడా శాసనానికి వెరుస్తాడు ఆ దేశంలో. ఇక్కడి పరిస్థితి వేరు. కోర్టు వారి ఉత్తరువులను ఖాతరు చేయరు ఆ ధూర్త పురుషులు. వారు ఆ శిక్షలను తిరస్కరించినా వారికి తగిన శిక్షలు పడవు. మన దేశంలో పరిస్థితి దారుణంగా ఉంది.

నేరాలకు సంబంధించిన శాసనాన్ని రెండవసారి 1983లో సవరించారు. సవరణ చట్టం సంఖ్య 1983లో 46వది. దానికి అధ్యక్షుని ఆమోదం 26-11-83న వచ్చింది. అందులో వచ్చిన ముఖ్యమైన సవరణ భార్యపై హింసకు సంబంధించినది. ఇది క్రొత్త సెక్షను 498 A ద్వారా వచ్చింది. భర్తగాని, భర్త బంధువుగాని ఒక స్త్రీని హింసకు లోను చేస్తే ఆ వ్యక్తికి 3 సంవత్సరాల వరకు జైలు శిక్ష మరియు జరిమానా కూడా విధించవచ్చును. స్త్రీయొక్క శారీరక మానసిక ఆరోగ్యానికి తీవ్రంగా భంగం కలిగించడం, ఆమె అవయవాలకు తీవ్ర ప్రమాదం కల్గించడం, ఆమె ప్రాణాలకు తీవ్రంగా అపాయం కల్గించడం లేక ఆమె ఆత్మహత్య చేసుకునే లాగ ప్రవర్తించడం ఇవన్నీ హింస క్రిందికి వస్తాయి. ఆమెను గాని ఆమె బంధువును గాని ఆస్తి, ధనం, విలువగల పత్రం ఇమ్మని బలవంతం

చేయటం లేక ఆమె లేక ఆమె బంధువు ఆ కోరికను తీర్చని పక్షంలో ఆమెను బాధపెట్టి చికాకు పరచటం హింస క్రిందనే లెక్క.

వివాహమయిన 7 సంవత్సరాల లోగా భార్య ఆత్మహత్య చేసుకున్నపుడు, పెండ్లి అయిన 7 సంవత్సరముల లోగా ఆమెను హింసించి మరెవరైన ఆమె యెడల నేరం చేసి ఉంటారని సహేతుకమైన అనుమానం కలిగినపుడు, వివాహం దరిమిలా 7 సంవత్సరములలోగా ఆమె చనిపోతే ఎవరైన ఆమె బంధువులు రిపోర్టు ఇచ్చినపుడు, ఆ స్త్రీ చనిపోవటానికి గల కారణాలను గురించి సందేహం కలిగినపుడు, అలా కాక ఏ కారణం వలనైన పోలీసు ఆఫీసరుకు యుక్తమని తోచినపుడు మృతుని శరీరాన్ని దగ్గరలో యున్న ప్రభుత్వ సివిలు సర్జనకు పరీక్ష నిమిత్తం పంపవలెను. (సెక్షను 176 సవరణ). ఈ నియమావళిని పాటిస్తే డాక్టరు యొక్క అభిప్రాయం లభ్యమవుతుంది.

ఏ వ్యక్తి అయినా పోలీసువారి అధీనంలో ఉండగా మరణించినచో, వివాహమయిన 7 సంవత్సరముల లోగా స్త్రీ ఆత్మహత్య చేసుకున్న సందర్భాలలో, పెండ్లి అయిన 7 సంవత్సరాలలోగా ఆమె చనిపోతే మరెవరైన ఆమె యెడల నేరం చేసి ఉంటారని సహేతుకమయిన అనుమానం కల్గినపుడు మేజిస్ట్రేటు విచారణ చేయవలెను. సాక్షుల 'స్టేటుమెంట్లను' నమోదు చేయవలెను (సెక్షను 176 సవరణ).

పోలీసు రిపోర్టు మీద నేరానికి బలి అయి బాధపడే స్త్రీ యో లేక ఆమె తల్లిదండ్రులు లేక ఆమె సోదరుడు లేక సోదరి, తల్లి లేక తండ్రి యొక్క సోదరుడు లేక కోర్టువారి అనుమతితో ఆమె రక్త సంబంధీకులు, వివాహం ద్వారా కాని దత్తు ద్వారా కాని బంధువులు రిపోర్టు చేసినపుడు మాత్రమే సెక్షను 498 A లో నమోదు కాబడిన సెక్షను క్రింద నేరం విషయమై కోర్టు ఫిర్యాదును స్వీకరించవలెను. అంటే ఇలాంటి కేసులలో ఎవరు పడితే వారు సరాసరి నేరుగా ఫిర్యాదు చేయటానికి వీలు లేకుండా చేయబడినది.

భార్య లేక ఆమె బంధువులు, లేక రాష్ట్ర ప్రభుత్వంచే ఈ సందర్భంగా పేర్కొనబడిన ప్రభుత్వ ఉద్యోగి ఫిర్యాదు చేస్తేనే పోలీసు వారు ఈ కేసును

పట్టించుకోవలసి యున్నది. సెక్షను 498 A నేరాన్ని ఫస్టు క్లాసు మేజిస్ట్రేటు విచారించగలడు.

ఇటీవల సెక్షను 498 A క్రింద కేసులు నమోదు చేయటం హెచ్చుగా జరుగుతున్నది కాని ఆ కేసులు ఎన్ని కోర్టులలో విచారణకు వస్తున్నాయి, ఎన్నింటిలో భర్తలకు శిక్షలు పడుతున్నాయి అనేది వేరే విషయం.

'భార్యలపై హింస'పై ఇతరదేశాలలో విపరీతంగా సాహిత్యం వస్తుంది; ప్రచారం సాగుతున్నది. అమెరికాలో వాషింగ్టను నగరంలోని స్త్రీల కేంద్రం వారు 'కుటుంబంలో హింస: ప్రతిస్పందన' అనే వార్తా సమాచార పత్రికను ప్రచురిస్తున్నారు. అందులో కుటుంబంలో స్త్రీలపై హింస, హింసకు లోనయిన స్త్రీల కథలు వగైరాలు ఉంటాయట. అమెరికాలో కేంబ్రిడ్జి నగరం నుండి 'హింసలకు లోనయిన స్త్రీలడైరెక్టరీ' ప్రచురితమయింది. అమెరికా లోనూ, తదితర ప్రపంచంలోనూ ఉన్న శరణాలయాలు, రక్షణకు ఎవరి సహాయాన్ని కోరాలి, సహాయం ఎక్కడ త్వరగా లభిస్తుంది, న్యాయ-వైద్య సలహాలు ఎక్కడ దొరకుతాయి అనే అంశాలు ఆ డైరెక్టరీలో పొందుపరిచారు. బోస్టను నగరంలో స్త్రీలచే నిర్వహింపబడుతున్న శరణాలయం వారు "మమ్మల్ని కొట్టనీయం'' అనే ఫిల్మును తీశారట. అందులో హింసకు లోనయిన స్త్రీలు ఈ విషయం చర్చిస్తారట. ఆ చర్చ చాల ఆసక్తి దాయకంగా ఉంటుందని ''విన్'' (Win: Women's International Net Work News) అనే స్త్రీ సంక్షేమాన్ని కాంక్షించే అమెరికను పత్రిక రాసింది. మన దేశంలో ఇలాంటి ప్రచారాలూ, ప్రసార సాధనాలూ లేవు. వాటిని ఒనగూర్చు కోవడానికి వనరులు లేవు. యావ అంతంత మాత్రమే. కాగా ఇటీవల హైదరాబాద్‌లో ఒక మహిళా సమాజంవారు వీధినాటకాల ద్వారా, ఫిల్ములద్వారా కొంత ప్రచారాన్ని చేపట్టారు. ఇది కొంతలో కొంత నయం. కాగా దరహం మీద చూసుకుంటే భారతదేశంలో ఈ రకమయిన కృషి చాల స్వల్పంగా జరుగుతున్నది. దీనికి కారణం స్త్రీలను శారీరకంగా దండించడం తప్పులేదనే ఆలోచనా ధోరణే. ఇది హింసకు లోనయిన స్త్రీల వ్యక్తిగత సమస్యమాత్రమే కాదు. ఇది సమాజాన్ని పీడించే రుగ్మత. దీనికి సకాలంలో సరియైన రీతిలో వైద్యం జరగాలి భారత మహిళోద్యమం ఈ విషయంగా కృషి చేస్తుందని ఆశిద్దాం.

# లైంగిక వేధింపు

విద్యార్థినులను, యువతులను బస్సుస్టాపుల వద్ద, సినిమాహాళ్ళవద్ద లైంగికంగా వేధించినందుకు కొంతమంది తుంటరి యువకులను పోలీసులు పట్టుకొని క్రిమినలు కోర్టులలో హాజరు పరుస్తున్నట్లు, మేజిస్ట్రేట్లు వారికి జరిమానాలు, జైలుశిక్షలు వేస్తున్నట్లు మనదేశ పత్రికలలో వార్తలు ఇటీవల చదువుతున్నాం. ఇలా ఈ సమస్య ప్రజల దృష్టికి వచ్చింది.

ఈ లైంగికవేధింపు క్రొంగ్రొత్త పరిణామం కాదు. పురుషజాతిలో రౌడీమూకలు, కాముకులు ఉన్నంతకాలం ఇది ఉంటూనే ఉన్నది. కాగా ఇంతకు క్రితం దీనిని గురించి స్త్రీలు ఫిర్యాదు చేసేవారు కారు. మౌనంగా సహించి ఊరుకునేవారు. ఇటీవల వారు ధైర్యంచేసి దాని విషయమై పత్రికలలో వ్రాస్తున్నారు; ఆందోళన చేస్తున్నారు. అంతే తేడా నాటికీ - నేటికీ.

లైంగిక వేధింపు పలురకాలుగా ఉంటుంది. జన సమ్మర్దాన్ని ఆసరాగా తీసుకొని స్త్రీని ఒరుసుకొని పోవడం, కొంగులాగటం, కౌగలించుకోవటం, ముద్దుపెట్టుకోవటం. ఆమె శరీరాన్ని గట్టిగా అదమటం ఇలాంటివి ఒకరకం. రద్దీలేకపోయినా వెంటబడి ఈలలు వేయటం, ఎగతాళిగా స్త్రీని అంగాంగ వర్ణన చేయటం బూతు కూతలు కూయటం. లైంగిక సంపర్కాన్ని ఆశిస్తూ అన్యాపదేశంగా అర్థించటం, ఒక్కొక్కప్పుడు సాహసంతో సమీపించి కొంగు పట్టుకోవటం, సూటిగా కళ్ళల్లోకి చూస్తూ మన్మధ యుద్ధానికి ఆహ్వానించటం, "నీవు పతివ్రతవేం కావు. నీవూ ఆ బాపతే" అన్నట్లు ఈసడిస్తూ మాట్లాడటం మరోరకం. తనకున్న హోదాను అధికారాన్ని దుర్వినియోగ పరచి తన వద్ద చదువుకునే విద్యార్థినులను, తన వద్ద కార్యాలయాల్లో పనిచేసే ఉద్యోగినులను ఫ్యాక్టరీ కార్మిక స్త్రీలను తనతో పొత్తు పెట్టుకోమని తొందర జేయటం మూడవ రకం. ఇలా ఎన్నెన్నో అవతారాలు తాలుస్తున్నది లైంగిక వేధింపు; ఎన్నెన్నో ప్రదేశాలలో సాక్షాత్కరిస్తున్నది. అన్ని ప్రదేశాలలోను ఈదుర్నీతి నడుస్తు న్నది.

మౌనంగా సహించి, ఆత్మశీల సంరక్షణార్థం గుట్టు చప్పుడు కాకుండా ప్రాణాలను వీడిన అబలలు ఎందరో ఉన్నారు. కాగా ఇటీవల స్త్రీ జాతిలో కొంత ధైర్యం వచ్చింది 'ఇతరుల దుర్మార్గానికి తాము ఎందుకు సిగ్గుపడాలి?' అనే భావన బయలుదేరింది. దానిని గురించి మాట్లాడటం ప్రారంభించారు. కాకపోతే అమెరికా, బ్రిటను లాంటి దేశాలలో దీని విషయమై ఆందోళన హెచ్చు. భారతదేశపు పరిస్థితి వేరు.

లైంగిక వేధింపుకు గురి అయిన స్త్రీ తన తోటివారితో ఫిర్యాదుచేస్తే "అందరినీ అలా వేధించరేమి? నీవే వాళ్ళను రెచ్చగొట్టి ఉంటావు. నీ మాటల తీరు, నీ నడక నాకు తెలియదా? ఆ వేషం ఏమిటి? ఆ సన్నని దుస్తులేమిటి? నీవే వాళ్ళని ఆకర్షించటానికి ప్రయత్నించి ఉంటావు." అని ఈసడిస్తారు. ఇంట్లోవాళ్ళూ అలాగే మాట్లాడుతారు. తమదాకా వస్తేగాని ఎవరికీ తెలియని దుర్గతి మనది. ప్రతి మనిషికీ స్వానుభవం కావాలి ఈ దేశంలో. పరుల అనుభవంవల్ల నేర్చుకోలేని దౌర్భాగ్యస్థితి మనది.

విద్యాలయాల్లో :- విద్యాలయాలు పవిత్రప్రదేశాలుగా పరిగణించడం పరిపాటి. కాని అక్కడ కూడా ఈ దుర్మార్గ ప్రవర్తన కనిపిస్తున్నది. హోళీ పండుగ సందర్భాలలో పురుషవిద్యార్థులు విద్యార్థినుల వసతిగృహంపై దాడిచేసి వారి దుస్తులను చింపి, వారిని శారీరకంగా హింసించి, మానసికంగా వెతల పాల్జేసి అవమానాలకు గురిచేసినట్లు సంఘటనలు పత్రికల్లో వస్తున్నాయి. ఆ దుండగీండ్రు ధనవంతుల కుటుంబీకులో, లేక రాజకీయవాదుల అనుంగు సన్నిహితులో కావటంవల్ల వారిపై ఏ శిక్షణచర్యలు తీసుకోబడటంలేదు. విద్యాలయాల్లో ఉండే ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు చేసే అత్యాచారాలు అంత తేలికగా బయటికి రావటం లేదు; అందులో ముఖ్యంగా వృత్తి కళాశాలలోని అధ్యాపకుల ఆగడాలను విద్యార్థినులు బహిర్గతం చేయటానికి వణికిపోతారు. ఇది మన దేశపరిస్థితి. లజ్జ, బిడియం పేర్లతో స్త్రీలను మాట్లాడనీయదు సంఘం; 'నీవు అశక్తురాలివి' అని మాటిమాటికి స్త్రీని హెచ్చరిస్తుంటుంది ఆమె అంతరంగం. దాంతో ఆమెలో పిరికితనం ఆవహిస్తుంది; గ్రుడ్లనీరు గ్రుడ్లకు కుక్కుకొని అలమటిస్తుంది; కృశిస్తుంది. పాశ్చాత్యదేశాల స్త్రీలలో నిర్భీకత చోటు చేసుకోవటంతో వారు బయటపడి మాట్లాడుతున్నారు. ఇలాంటి

దుర్మార్గపర్వాలను వెలికితీసి నిరసిస్తున్నారు వారు. వారికి లెక్కలున్నాయి. మనదేశంలో గణాంకశాస్త్రం అంతగా అభివృద్ధి చెందలేదు. లెక్కలు తీయం; ఏదైనా, సమస్యను అవగాహన చేసుకోవటానికి పాశ్చాత్యదేశాల సంఘటనలను ఉదాహరణలుగా తీసుకోవచ్చు. వారి దర్యాప్తులను పరిగణనలోకి తీసుకోవచ్చు.

అమెరికాలో ఒక రాష్ట్రంలో లక్షా పదివేల మంది విద్యార్థులు ఉంటే 20 శాతం మంది లైంగికంగా సంచరించనందుకు లంచాలకుగాని బెదిరింపులకుగాని లోనగుతున్నారట. పదకొండు సంవత్సరాల నుంచి ఆచార్యత్వం నిర్వహించిన ఒక అధ్యాపకుడు ఇద్దరు విద్యార్థినులను లైంగికంగా వేధించినందుకు, మరి ఇద్దరిని లైంగిక సంపర్కానికి రమ్మనమని ఆహ్వానించినందున శిక్షకు పాత్రుడయినాడు. ఒక వ్యాయామ శిక్షకుని ఉద్యోగం నుండి తొలగించారు ఇలాంటి నేరానికి, "వాషింగ్టను పోస్టు" (ప్రముఖ దినపత్రిక) 81 సెప్టెంబరులో వ్రాసిన వ్యాసంలో విశ్వవిద్యాలయాల్లో విద్యార్థినుల వేధింపు గురించి రాసింది.

తూర్పు కారోలీనా విశ్వ విద్యాలయంలో సామాజిక శాస్త్ర విభాగం దర్యాప్తు చేసింది. వారు 77 మంది విద్యార్థినులను భేటీ చేశారు. నూటికి ఎనిమిది మంది తమ లెక్చరర్లు తమకు అసౌకర్యం కలిగేటట్లు తాకేవారనీ, గిల్లేవారనీ, శరీరంపై తట్టేవారనీ చెప్పారు. అలాగే 226 మంది విద్యార్థినులకు ఉత్తరాలు వ్రాసి జవాబులు పొందటంద్వారా మరియొక పరిశోధన జరిగింది. ఆ సర్వేలో 0.9% మంది తమ టీచర్లు లైంగికంగా బాధపెట్టారని చెప్పారు.

2.2% లైంగిక సంపర్కాన్ని బహిరంగంగా టీచర్లు కోరారని చెప్పారు. 4.9% మంది పరోక్షంగా ఒత్తిడికి లోనయినామని, 8.9% మంది పురుష ఉపాధ్యాయులచేత నేరవిధంగా తాకబడ్డామని వివరాలతో పరిశోధకులకు సమాధానాలిచ్చారు.

భారతీయ విశ్వవిద్యాలయాలలో పరిస్థితి అమెరికా అంతగా దుర్మార్గంగా లేదని తోస్తుంది. అది కొంతగా కొంత నిజమే. మొదటినుండి స్త్రీ పురుషులు ఒకరికొకరు దూరంగా ఉండటం, స్త్రీల వేర్పాటు పద్ధతి సమాజంలో

ఉండటం దీనికి కొంత కారణం కావచ్చును. అధ్యాపకులు చొరవ తీసుకోవటానికి ధైర్యం చేయరు. అయితే వృత్తి కళాశాలల్లో, విద్యార్థుల భవిష్యత్తు ఎక్కువగా అధ్యాపకుల చెప్పుచేతల్లో ఉన్న సందర్భాలలో పరిస్థితి వేరుగా ఉంటున్నది. పాఠంలో ఏదైనా విషయం బోధపడలేదని ఏ విద్యార్థిని అయినా చెపితే,తన భార్య ఇంట లేని సమయాన్ని నిర్ధారణ చేసుకొని ఆ సమయానికి తన ఇంటికి వస్తే అర్థంకాని విషయాన్ని బోధపరుస్తానని విద్యార్థినికి చెప్పటం పరిపాటి. అప్పుడు, ఆమె అమాయకంగా వెళ్ళినపుడు ఆమెపై చొరవ తీసుకొని మాటలతో, చేతలతో ఆమెకు బాధ కలిగించటం తరుచుగా జరుగుతున్నవి. తోటి విద్యార్థినులతో చెప్పుకుంటే వారు ఈసడిస్తారని భయం. తల్లిదండ్రులకు తెలిస్తే మానమర్యాదలు నశిస్తాయని బెదురు. ఇలా అవమానానికి గురి అయిన విద్యార్థిని తన బాధను బయటికి వెళ్ళగ్రక్కలేక కుమిలి కుమిలి క్రుంగిపోతుంది. మనస్థైర్యాన్ని కోల్పోతున్నది. పాఠాలపై, తన విద్యాభ్యాసంపై శ్రద్ధ చూపలేకపోతున్నది. దుర్మార్గ ప్రవృత్తి కల ఆ అధ్యాపకుడు ఆమె నిస్సహాయతను ఆసరాగా తీసుకొని మరీ రెచ్చిపోతాడు. 'చదువులో వెనుకబడి ఉన్నావని' మరీమరీ హెచ్చరించి తన ఇంటికి పాఠాలకు రమ్మనమని ఒత్తిడి ఎక్కువ చేస్తాడు. తను ఎంతో పవిత్రుడయినట్లు, ఉదార హృదయుడయినట్లు, విద్యార్థులకోసమే తన జీవితాన్ని సాగిస్తున్నట్లు 'పోజు' పెడతాడు. అమాయకులు, అజ్ఞానులు అతని వైఖరిని చూచి అతడు మంచివాడని ప్రచారంచేస్తారు. దాంతో ఆ విద్యార్థిని పరిస్థితి కుడితిలో పడ్డ ఎలుకలాగ అవుతుంది. ఆమెకు రెండే రెండు మార్గాలు గోచరిస్తాయి. అధ్యాపకునికి లొంగిపోయి మంచి మార్కులుతెచ్చుకొని, సత్ప్రవర్తన కల విద్యార్థినిగా పేరు సంపాదించుకొని విద్యాలయం నుండి బయటపడటం మొదటిది అలా కాక అతనికి ఎదురుతిరిగి ఆ అధ్యాపకుని దుష్ప్రవర్తనను బహిర్గతం చేసి, తను అల్లరిపడి అతనిని అల్లరిచేయడం రెండవది. చివరి మార్గం సముచితమయినా కష్టతరం. కనుక ఆ స్థితిలో ఉన్న విద్యార్థినులలో చాల కొలది శాతం

మాత్రమే ఆ పద్ధతిని అనుసరించగలరు. ఏమైనా దేశ భవిష్యత్తు, విద్యార్థినుల భద్రత అలాంటి పంథాపైననే ఆధారపడుతుంది.

కార్యాలయాల్లో:- ఆఫీసులల్లో. కార్యాలయాల్లో సెక్సు కొరకు అధికారులు ఒత్తిడితెచ్చిన బాధలను కథలుగా అంతరంగిక కార్యదర్శులు, ఇతర ఉద్యోగినులు చెప్పటం జరిగింది. ఒక్కొక్కప్పుడు సరాసరి కోరడం, కొన్ని కేసులలో పరోక్షంగా సూచించడం జరుగుతోందట. జీన్ అనే 20 సం॥రాల యువతి బీదకుటుంబంనుండి వచ్చింది. ఆమె తల్లిదండ్రులను పోషించాలి. ఇంటిఅద్దె చెల్లించాలి. తిండితినాలి. తాను బతకాలి. ధనవంతులైన చుట్టాలు, మేనమామలు, పినతండ్రులు ఆమెకు లేరు. ఆమె, సూపరువైజరు పురుషుడు. అందరిలాగానే ఉంటే మంచిదని అతడు సూచించాడు. కాని ఆమె అందుకు అంగీకరించలేదు. ఉద్యోగం ఊడింది. అన్నా అనే ఆమె అవివాహిత. ఆమెపై అధికారి ఆమెను గురించి అతిగా పట్టించుకోవడం మొదలుపెట్టాడు. మర్యాదగా కాదని అనేకసార్లు చెప్పింది ఆమె. ఆఫీసరు ఆమె విముఖత్వాన్ని సహించలేకపోయాడు. ఆమెచేసే చిన్నచిన్న తప్పిదాలను రిపోర్టు చేయసాగాడు. అంతటితో ఆగక బెదిరింపులకు దిగాడు. అప్పటికే సహించింది. ఒకరోజు సూపర్‌వైజరు ఆమెపై డైరెక్టరుకు రిపోర్టు చేశాడు. అన్నా అతనిని అనుసరించింది డైరెక్టరు ఆఫీసులోకి. అసలు విషయం చెప్పింది డైరెక్టరుకు. అతను సానుభూతి చూపాడు. అప్పటినుండి సూపర్‌వైజరు ఆమె జోలికి రాలేదు. వారిరువురు నాటినుండి మౌనంగా శత్రువులయ్యారు. ఇలాంటి బాధలు, ఇబ్బందులూ ఉద్యోగినులు పట్ల అన్ని దేశాలలోనూ జరుతూనే వున్నాయి. కాదనగలమా? భర్తలుగా, తండ్రులుగా స్త్రీలు నీతిగా వుండాలని పురుషులు కోరుకుంటారు. కాని కార్యాలయాల్లో ఆ పురుష అధికారులే నీతిగా వున్న స్త్రీలను వేధిస్తారు. ఇది ద్వంద్వ నీతికి ప్రబల నిదర్శనమని చాటి చెప్పాలి.

స్త్రీలు పురుషులు ఎక్కువగా పనిచేసే కార్యాలయాలలో కొంతమంది తోటి పురుష ఉద్యోగులు, తమపై అధికారం సాగించే పురుష ఉద్యోగులు

ఉద్యోగినులను వెతల పాల్జేస్తారు. కాస్త మంచి దుస్తులు వేసుకున్న స్త్రీని, సరదాగు బెరుకు లేకుండా మాట్లాడే వనితను, కొద్దిపాటిగానైనా సరే తన రూపాన్ని ఆకర్షణీయంగా చేసుకున్న స్త్రీని చులకనగా చూడటం, రహస్యంగా ఆమెపై నిందలు మోపడం, ఎదుట ఎగతాళిగా మాట్లాడటం, వక్రోక్తులు విసరడం పరిపాటి. వివాహిత పురుషులు, ముగ్గురు నలుగురు బిడ్డల తండ్రులైన పురుషులు కూడా ఇలాంటి దుష్ప్రవర్తనకు దిగడంగడం శోచనీయం. ఆ మహిళ అవివాహిత అయినా, విధవ అయినా, విడాకులకు లోనయిన ఉవిద అయినా వారు మరీ పెచ్చుపెరిగిపోతారు. ఆమెకు నాధుడు లేడు కనుక అమె అనాధయని, ఆమె ఎవరికీ చెందనది కనుక అందరికీ ఆమెపై హక్కులున్నాయని తలపోస్తారు. వారి దుర్మార్గాన్ని ఆమె సహించకపోతే, బెదిరిస్తే ఆమె జీవితాన్ని దుఃఖభాజనం చేయటానికి శాయశక్తులా కృషిచేస్తారు. పై ఆఫీసరుకు ఫిర్యాదుచేస్తే ఆ ఫిర్యాదును అతడు పాటిస్తాడో లేదో యని సందేహం పొడసూపుతుంది. దాంతో, చేతనయితే అక్కడినుండి మరో కార్యాలయానికి బదిలీ చేయించుకోవడం లేక జీతం లేకపోయినా - నష్టపడి అయినా సరే - దీర్ఘకాల సెలవుమీద వెళ్ళడమో తటస్థిస్తుంది. ఇది విపరీత పరిస్థితి.

దీనికి పరిష్కారమార్గం లేకపోలేదు. ఉద్యోగినులు సంఘటిత శక్తిని పెంచుకోవాలి. అన్యాయాలను ఎదుర్కోవాలి. దానికి మున్ముందుగా తాము పురుషాధిక్య సమాజపు విలువలను విడనాడాలి. స్వశక్తిమీద ఆధారపడి పరిస్థితిని చక్కదిద్దుకోవాలి. అంతేకాని స్త్రీ పురుషులు కలసి పనిచేయవలసిన కార్యాలయాలనుండి వైదొలగరాదు.

*ఫ్యాక్టరీలలో:-* ఫ్యాక్టరీలలో లైంగిక వేధింపును దర్యాప్తు చేయటానికి బ్రిటన్‌లోకల్లా పెద్దదైన ఉద్యోగస్తుల సంఘం కమిటీని వేసింది. ఆ జాతీయ సమానత్వ పరిరక్షణ కమిటీ దర్యాప్తుకు పూనుకున్నది. దాంట్లో 13 మంది స్త్రీలు, ఇద్దరు పురుషులు సభ్యులుగా వున్నారు. ఈ కమిటీ లైంగిక వేధింపుపై

సమగ్రంగా దర్యాప్తు జరిపి రిపోర్టులు ఇచ్చి కొంత ఉపయోగపడుతోంది. కెనడా ఉద్యోగస్తుల సంఘపు కృషివల్ల బ్రిటిషు స్త్రీలు ఉత్తేజితులు అయినారు కెనడాలో 70 నుండి 88 శాతం వరకు ఏదోరకంగా ఉద్యోగినులు లైంగిక వేధింపుకు గురి అయినారట. సగం మంది ఉద్యోగాలు వదలి వెళ్ళి పోయారట.

నాల్గో (Nalgo) అనే బ్రిటిషు ఉద్యోగుల సంఘంలో ఏడున్నర లక్షల మంది సభ్యులున్నారు అందులో సగం మంది స్త్రీలు. ఈ సంఘ స్త్రీల విషయమై అభ్యుదయకరమైన వైఖరిని అవలంబిస్తున్నదని ప్రతీతి. ఏ ఉద్యోగిని అయినా ఫిర్యాదుచేస్తే ఆమెతో వ్యక్తిగతంగా మాట్లాడటానికి ఒక సంఘ కార్యకర్తను కేటాయించారు సంఘ అధికారులు. ఆమె ఫిర్యాదు నిజమని నమ్మితే ఆమె కేసును సంఘం చేపట్టింది.

ఐరోపాలోని కామన్ మార్కెటు సంఘం దర్యాప్తు చేసింది. ఒక దర్యాప్తు ప్రకారం ఫ్రాన్సులో 8 శాతం ఉద్యోగినులు, ఇంగ్లాండులో 7 శాతం ఉద్యోగినులు లైంగిక వేధింపుకు గురి అయినారని తేల్చింది. మరియొక దర్యాప్తు ప్రకారం 100కి 10 మంది స్త్రీలు అలా వేధింపుకు గురి అయినారని వెల్లడి అయింది. విడాకులు పొందిన స్త్రీలు, భర్త నుంచి వేరుపడి విడిగా జీవిస్తున్న స్త్రీలు ఈ రకమయిన ఇబ్బందులకు ఎక్కువగా పాత్రులవుతున్నారని తెలుస్తున్నది. అలాంటి స్త్రీలలో 100కి 25 మంది ఇలా అసౌకర్యాల పాలయినట్లు లెక్కలు వచ్చాయి. మాక్ ప్లాను దర్యాప్తు ప్రకారం 100కి 5గురు స్త్రీలు తమతోటి పురుష ఉద్యోగుల కోర్కెలు తీర్చనందుకు శిక్షాపాత్రులయ్యారట. ఈ వేధింపు స్త్రీల వయస్సును బట్టి ఉంటుంది. 25 నుండి 34 సం॥ వరకు వయస్సు ఉన్న స్త్రీలలో ఇది 10 శాతం. విడాకులు పొందిన స్త్రీలలో ఇది 13 శాతం.

మామూలుగా చాల మంది స్త్రీలు తమ అధికారులపై ఫిర్యాదు చేయరు. దర్యాప్తుల నివేదికలు ఆవగింజలో అరవవంతు విషయాన్ని మాత్రమే బయట

పెడుతున్నాయి. రిపోర్టుకాని కేసులు చాల వుంటాయి. ఎక్కువగా ఈ వేధింపుకు బలి అయిన స్త్రీలు పోలీసుల దగ్గరకు పోరు. పోలీసుల ప్రశ్నలవల్ల కలిగే చిరాకు, మామూలుగా పురుష వైద్యులచేత శారీరక పరీక్ష, పైగా నిందితుని బెదిరింపు ఇవి అన్నీ ఆ స్త్రీలను ఫిర్యాదు చేయనీయవు. సకృత్తుగా ఒకటి అర కేసు నమోదు అవుతాయి. వాషింగ్టను విశ్వవిద్యాలయంలో ఒక కాలేజి అధ్యక్షునిపై సెక్రటరీ వేధింపు ఆరోపణ చేసింది. అలాగే జీవశాస్త్ర విభాగపు ప్రొఫెసరు ఒకామె ఒక కాలేజీ పరిపాలకునిపై ఫిర్యాదుచేసింది. ఇలాంటివి బహు అరుదుగా జరుగుతాయి.

ఫ్యాక్టరీలలో, స్త్రీలు చాలమంది పనిచేస్తున్నారు. పొగాకు గ్రేడింగు కార్ఖానాలలో, బీడీ పారిశ్రామిక శాలలలో, కట్టుబడి పరిశ్రమలో విరివిగా పనిచేస్తున్నారు ఒక్కొక్కప్పుడు వారు 'గేటుమెన్'ల వల్ల, మగ సూపర్‌వైజర్లవల్ల, తాపీ మేస్త్రీల వల్ల లైంగిక వేధింపుకు గురిఅవుతున్నారు. కొందరు అండదండలులేని స్త్రీలు వారి ఒత్తిడికి లొంగిపోవటం కద్దు. కార్మిక సంఘాలు కార్మికోద్యమాలు ఈ అంశాన్ని ఇంతవరకు భారతదేశంలో పట్టించుకోలేదు. కార్మికవర్గ నాయకత్వం మగవారి చేతుల్లో ఉన్నందున నాయకత్వానికి ఈ సమస్యపై శ్రద్ధలేదు. ఆసక్తి చూపినా సమస్య లోతుపాతులను అర్థం చేసుకోగల ఓర్పు నేర్పు నాయకులలో లేదు. భారతదేశంలోని కార్మిక స్త్రీలు ఈ విషయమై తామే చొరవను ప్రదర్శించవలసి ఉన్నది.

నష్టం:- లైంగిక వేధింపుకు గురి అయిన వారికి కలిగే వ్యక్తిగత నష్టం కాక దేశానికే నష్టం సంభవిస్తుంది. అమెరికాలో అలా 9 కోట్ల డాలర్ల విలువగల నష్టం వాటిల్లుతున్నదట. ఉత్పాదకశక్తి తగ్గుదల, నైతిక ధృతి నశించటం, ఈ వేధింపుకు తట్టుకోలేక స్త్రీలు ఉద్యోగాలు వదలి వెళ్ళిపోతే క్రొత్తగా చేరేవారికి శిక్షణ ఇవ్వటానికి వ్యయప్రయాసలు ఇవన్నీ లెక్కకడ్తే ఆ మొత్తం తేలింది.

కేసులు:- బ్రిటనులో నిందితులలో 17 శాతానికి 2 సం॥ వరకు 50 శాతానికి 2 నుండి 4 సం॥, 26 శాతానికి 4 నుండి 7 సం॥ శిక్షలు వేశారు. 1979 లో 1700 కేసులు వస్తే 435 కేసులలో జైలుశిక్ష వేశారు. బ్రిటనులో 25 సం॥ వరకు శిక్షవేయవచ్చును.

అమెరికాలో 25 సం॥ వరకు శిక్షవేయవచ్చును. 1981 లో 1200 కేసులు నమోదు అయినాయి. 300 కేసులలో శిక్షపడింది.

నేర పరిస్థితి విశ్వవిద్యాలయాల్లో మరీ ఘోరంగా ఉంది. కేంద్ర ప్రభుత్వ నేర పరిశోధనా సంస్థలెక్కల ప్రకారం 107 కాలేజీలలో, విశ్వ విద్యాలయాల్లో స్త్రీలపై అత్యాచారాలు జరిగాయి. 1971 లో 10 నేరాలు జరిగితే 1980 లో అవి 157 కి పెరిగాయి. దేశం మొత్తం మీద మాన భంగాల సంఖ్య 46 శాతం పెరిగితే విద్యార్థిలోకం కాపురముండే విశ్వ విద్యాలయాల్లో 55 శాతంగా పెరిగింది. విద్యార్థులు తాగివారు విద్యాలయాల ఆవరణలలో నేరాలు చేస్తున్నారని అధికారులు సంజాయిషీ చెప్పుకొని తృప్తి పడుతున్నారు. వాషింగ్టను విశ్వ విద్యాలయంలో రాత్రిపూట లైబ్రరీకి పోవడానికి విద్యార్థినులు విముఖత చూపిస్తున్నారు ఈ వేధింపు భయం వల్ల. మేరీలాండ్ కాలేజీలో ప్రతి 500 మంది విద్యార్థులకు ఒక పోలీసు ఉండవల సిన పరిస్థితి ఏర్పడింది.

భారతదేశంలో లైంగిక వేధింపుకు సంబంధించిన కేసులు పెద్ద పట్టణాలలో నెలకు రెండు మూడు మాత్రమే తటస్థిస్తున్నాయి. బస్సుస్టాపుల వద్ద ఈ దుశ్చర్యలకు పూనుకునే అల్లరి విద్యార్థులను, రౌడీలను అరెస్టు చేస్తున్నారు. శిక్ష చాల స్వల్పంగా వేయటం వలన, శిక్షలకు తగు ప్రచారం లభించనందున ఈ దుర్మార్గాలు ఆగటంలేదు.

లైంగికవేధింపు సంబంధమైన నేరాలు :

ఒక స్త్రీకి మాన నష్టం కలిగించాలనే ఉద్దేశ్యముతో లేక తన దుశ్చర్య వలన మాన నష్టం కలుగుతుందని తెలిసి ఏ వ్యక్తి అయినా ఆ స్త్రీపై దౌర్జన్యం చేసినా, ఆమె యెడల నేరస్వభావం కలిగిన బలాన్ని ప్రయోగించిన అతనికి భారత శిక్షాస్మృతి సెక్షను 354 క్రింద రెండు సంవత్సరాలవరకు జైలు శిక్ష లేక జరిమానా లేక రెండూ విధించవచ్చును. ఏ స్త్రీయొక్క మాన మర్యాదలనైనా భంగపరచదలచి, తను మాట్లాడే మాటకాని, తను చేసే శబ్దంకాని ఆమె వినాలని ఉద్దేశించి లేక తన చేష్టను తను ప్రదర్శించేదానిని ఆమె చూడాలని ఆశించి ఏ వ్యక్తి అయినా ఒక మాటను అన్నా, లేక శబ్దం చేసినా, లేక చేష్టచేసినా, దేనినైనా ప్రదర్శించినా, లేక ఆమె ఏకాంతతను అనుమతి లేకుండా భంగపరిచినా ఆ వ్యక్తికి ఒక సంవత్సరం వరకు జైలు శిక్ష లేక జరిమానా లేక రెండూ వేయవచ్చునని భారత శిక్షాస్మృతి సెక్షను 509 చెప్తున్నది. అంటే ఒక స్త్రీని అవమాన పర్చాలని అమెకు అమర్యాద కలుగజేయాలని పోకిరి మాటలు పలికినా, ఈలలు వేసినా, లేక కళ్ళల్లో కళ్ళు పెట్టి చూచిపోయినా, లేక తన శరీరావయవ ప్రదర్శన చేసినా నేరమేనన్న మాట. ఈ సెక్షను క్రిందనే అపుడపుడు పోలీసులు కేసులు నమోదు చేస్తుంటారు. మేజిస్ట్రేటులు మందలించి వదిలివేయడం లేక చాల తక్కువ శిక్షలు వేయడం మూలాన ఈ నేరాలు చేయడానికి అల్లరి యువకులు సంకోచించటం లేదు. న్యాయమూర్తులు కఠినవైఖరిని అవలంబించవలసిన అవసరం ఉన్నది.

సాహిత్యం:- అమెరికా (USA) లోని 'ఉద్యోగాల సమానావకాశాల కమీషను' 'కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల్లో లైంగిక వేధింపు' అనే కర పత్రాన్ని ప్రకటించింది. ప్రభుత్వ కళాశాలలు, విశ్వవిద్యాలయాల సంఘం లైంగిక వేధింపుపై కరపత్రం ప్రచురించింది. లైంగిక వేధింపును అవినీతికర చర్యగా నిర్ణయించారు. ఇలాంటి ఫిర్యాదుల విచారణకు సంబంధించిన సూచనలను ఇచ్చింది ఈ కరపత్రం. విస్కానిసిన్ విశ్వవిద్యాలయం వారు 'లైంగిక

వేధింపు విషయమై తీసుకోవలసిన వైఖరి, విధానం; వాటి అమలుకు మార్గదర్శక సూత్రాలు' అనేక గ్రంథం వెలువరించారు. అందులో లా ప్రకారం లైంగిక వేధింపు అంటే ఏమిటి, విచారణ పద్ధతి, సంస్కార సమ్మతితో పరిష్కార మార్గాలు అనే అంశాలు వివరించడం జరిగింది.

అమెరికాలోని 'ఉన్నత వృత్తుల నవలంబించే ఉద్యోగినుల సంఘాల ఫెడరేషను' లైంగిక వేధింపుపై కరపత్రాల సంపుటి విడుదల చేసింది. లా ప్రకారం నిర్వచన, కోర్టుకేసుల సారం, ఉద్యోగినులు వేధింపు విషయమై ఏంచేయాలి, విచారణ ఎలా జరగాలి అనే అంశాలు వాటిలో రాశారు. అంతేగాక 1964 లోని పౌరహక్కుల శాసనం క్రింద లైంగిక వేధింపు శిక్షార్హమని గుర్తు చేయడం జరిగింది

స్త్రీలలో విజ్ఞానం పెంపొందించే నిమిత్తం అమెరికాలో ఒక సంఘం 'స్త్రీల మనుగడ కోసం' అనే వార్తా సమాచార పత్రికను నడుపుతోంది. అందులో "మానభంగాన్ని తప్పించుకోవడానికి ఏంచేయాలి, నిన్నుకాని, నీ పిల్లలనుగాని వేధిస్తుంటే ఏం చేయాలి, నీ ఇంట్లోకి దురుద్దేశంతో వచ్చే ఆగంతకుని ఎలా నిరోధించాలి" అనేవి ఉన్నాయి. అంతేగాక లైంగిక వేధింపుకు గురి అయినట్లు వివరించేది ఎలా? అలాంటప్పుడు ఏ చర్యకు ఉపక్రమించాలి, నీపై ఎవరైనా దాడిచేస్తే తప్పించుకోటానికి ఏం చేయాలి అనే విషయాలను విశదీకరించారు. ఇలాంటి సాహిత్యం భారతదేశంలో ఏనాడు అధికారికంగా వెలువడుతుందో!

భారతదేశంలో 'మానుషి' లాంటి హిందీ, ఇంగ్లీషు మాసపత్రికలు ఒకటో రెండో ఈ విషయమై శ్రద్ధవహించటం గమనిస్తున్నాం. కాగా ప్రత్యేకంగా ఈ విషయంగా సాకల్యమైన సమగ్రమైన పుస్తకాలు వెలువడలేదు. ఈ దశాబ్దంలోగా అలాంటి సాహిత్యం మన దేశంలోని ముఖ్య ప్రాంతీయ భాషలలోకూడ వెలుగు చూస్తుందని ఆశిద్దాము.

కర్తవ్యం:- ఇదంతా చదివినవారు రెండు వైఖరులను ప్రదర్శించవచ్చు. "స్త్రీలు ఉద్యోగాలు చెయ్యనక్కరలేదు. ఇళ్ళల్లో ముసుగువేసుకొని కూర్చుంటే సరిపోతుంది"అనేది ఒకటి. "స్త్రీలకు అవసరమైన రక్షణ ఇవ్వాలి" అనేది రెండవది. మొదటి వైఖరి ఆలోచనలో తప్పు; ఆచరణలో అసాధ్యం. సగం మంది జనాభా ఉన్న స్త్రీలను ఉద్యోగాలు చెయ్యవద్దని శాసించడానికి ఎవరికి అధికారం ఉంది? ఉద్యోగం, వృత్తి అచ్చంగా తిండి సంపాదించుకునే మార్గాలే కావు, ఆమె వ్యక్తిత్వ వికాసానికి, ఆమె ప్రయోజకత్వానికి అవి ప్రతీకలు. జాతి సంస్కృతిని రక్షించాలనే తాపత్రయంతో కొందరు, పైకి గట్టిగా చెప్పక పోయినా, స్త్రీలు వంట ఇంటి కుందేళ్ళయితే బాగుంటుందని భావిస్తున్నారు. ఈ వైఖరి గర్హనీయం; నింద్యం. రెండవ ఆలోచన సక్రమమైనది. కాగా ఎన్ని శాసనాలయినా వ్యక్తులను అందులో స్త్రీలను రక్షించలేవు. ప్రజాభిప్రాయం ద్వారా సమాజపు ఆలోచనా ధోరణిలో మార్పు రావాలి. దానికి మహోద్యమం పూనుకోవాలి. స్త్రీలు ముమ్మందుగా చొరవ తీసుకుంటే తర్వాత సహృదయులైన పురుషులు వారిని బలపరుస్తారు. ఈ విషయమై సమస్య అవగాహనా శక్తిని, చైతన్యాన్ని, చొరవను ప్రదర్శించటం అవసరం.

# మానభంగాలు

ఏ రోజు పత్రిక తీసినా తాటికాయలంత అక్షరాలతో 'ఆ ఊళ్ళో మానభంగం', ఈ నగరంలో మానభంగం' అని శీర్షికలతో వార్తలు వస్తున్నాయి. 'మానభంగాల కేసుల సంఖ్య పెరిగిందా? లేక పత్రికలలో వార్తకెక్కటం ఎక్కువయిందా?' అనే సందేహం రావటం సహజం. ఈ అత్యాచారాలు పూర్వంకూడా జరిగాయి; ఇపుడూ జరుగుతున్నాయి. ఇవి తీవ్రమైన నేరాలని ప్రజాభిప్రాయం బలపడుతున్నందున ఈ వార్తలు వస్తున్నాయి. మన దేశంలో లెక్కలు లేవు కాని అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మంచికి చెడ్డకూ లెక్కల ఆరా ఉంటుంది. దర్యాప్తు సంఘం వారి నివేదిక ప్రకారం 1979లో 82000 కేసులు నమోదు అయ్యాయట. ఈ సంవత్సరం కన్న తరువాత సంవత్సరంలో 100కి 9 వంతున కేసులు పెరిగాయి. అంటే 6 నిమిషాలకు ఒక మానభంగం జరుగుతున్నదన్నమాట. అన్ని కేసులూ పోలీసులదాకా రావటం లేదు. 100కి 80 కేసులు మాత్రమే పోలీసులవద్ద ఫిర్యాదుకు వస్తున్నాయి. అంటే నాలుగున్నర నిమిషాలకు ఒక మానభంగం సంఘటన సంభవిస్తున్నదన్నమాట. ఇలా చెప్పారు అమెరికావారు; అలా చెప్తేనే దాని తీవ్రత మనకు అర్థం అవుతుంది.

ఇంగ్లండులో ఒక కేసులో న్యాయమూర్తి ఇచ్చిన తీర్పు నారీలోకాన్ని ఉద్రేక పరిచింది. ఆందోళనకు దారితీసింది. ఒక స్త్రీ పాదచారియై దేశాటనం చేస్తున్నది. ఆమెను ఒక దుర్మార్గుడు మానభంగం చేశాడు; కేసు నమోదు అయింది. ఆమె ఒంటరిగా తిరుగుతున్నందున ముద్దాయికి నేరం చెయ్యటానికి ప్రేరణ కలిగిందని న్యాయమూర్తి అభిప్రాయ ప్రకటన చేశాడు; నేరానికి గురిఅయిన ఆమెను తప్పుపట్టాడు. ఆమె పాదచారియై ఒంటరిగా దేశాటనం చేయటం తప్పట! ముద్దాయికి 2 వేల పౌనులు జరిమానా వేశాడు జడ్జి. కేసు ఉన్నతోన్నత న్యాయస్థానానికి వెళ్ళింది. ఆమె దోషం ఏమీలేదని, ఆమె పరోక్షంగా నేరానికి కారకురాలని - Cantributory Negligence -

ముద్దాయి వాదించ వీలులేదని ప్రధాన న్యాయమూర్తి లార్డు హెయిల్ షాం తీర్పు చెప్పారు.

2 వేల పౌనుల జరిమానాతో తప్పించుకున్న ముద్దాయి నేరం చేసిన ప్రదేశంలోనే 17 సంవత్సరాల అమ్మాయిని ఒక మోటారుకారు డ్రైవరు మానభంగం చేశాడు. ఆమెకు తన కారులో 'లిఫ్టు' ఇచ్చి, ముప్పావుగంట త్రిప్పి, సరికి వేస్తానని బెదిరించి ఆమె మానాన్ని దోచుకున్నాడు ఆ ముష్కరుడు. జరిమానాలతో సరిపెట్టే ఇలాంటి కేసులు పెరగక ఏమవుతుందని జరిమానా కేసులోని స్త్రీ తండ్రి వ్యాఖ్యానించాడు.

1982లో స్కాట్లండులో గ్లాస్గో నగరంలో ఒక నేరం జరిగింది. ఒక వీధిలో వెళ్ళుతున్న 29 సంవత్సరముల వయస్సుకల స్త్రీని ముగ్గురు యువకులు లాక్కెళ్ళి ఆమెను చెరిచారు. అంతేగాక ఆమెను రేజరు బ్లేడుతో గాయపరిచారు. ఆమెకు 168 కుట్లు వేయవలసి వచ్చింది. జీవితముపై రోతకలిగి ఆమె ఆత్మహత్య చేసుకో ప్రయత్నించింది. ఆమె సాక్ష్యం ఇవ్వగల స్థితిలోలేదని బ్రిటీషు ప్రభుత్వంవారు కేసు వదులుకున్నారు. అందుకు కావలసిన అనుమతిని న్యాయమూర్తి మంజూరుచేశాడు. ఇది పార్లమెంటు సభ్యుల విమర్శకు గురి అయింది. మహిళా సంఘాలవారు కోపోద్రిక్తులైనారు. ఒక మంత్రి గ్లాస్గో కేసును వదులుకోవడాన్ని సమర్థిచాడు. పార్లమెంటు సభ్యులు అతని సమర్ధనను నిరసించారు. అతడు రాజీనామా చేయవలసి వచ్చింది.

''సండే టయిమ్సు'', అనే దినపత్రిక అభిప్రాయసేకరణ చేసింది. దాని, ఫలితంగా ఈ అంశాలు తేలాయి. మానభంగాల కేసులలో ఫిర్యాదు చేసే స్త్రీలపై పోలీసులకు సానుభూతి లేదు. ఇపుడున్న శాసనాన్నిబట్టి, కోర్టుల స్థితిగతులను పరిగణించి నిందితుడు శిక్ష లేకుండా తప్పించుకొని పోవటానికి అవకాశం ఉందని 70 శాతం వయోజనులు భావించారు. అలాంటి కేసులలో నిందితునికి మరణశిక్షగాని, కనీసం 7 సం॥ జైలు శిక్షగాని వెయ్యాలని 100కి 85 మంది భావించారు ఈ సర్వేలో 1065 మందిని - స్త్రీ పురుషులను సమ సంఖ్యలో-అభిప్రాయాలు అడిగారు లైంగిక వివక్ష వ్యతిరేక శాసనం స్త్రీ పోలీసులను ఇలాంటి కేసులలో దర్యాప్తుకు నియమించడానికి అడ్డురాదని 'సమానావకాశాల కమీషను' అధ్యక్షురాలు ప్రభ్వి లాక్ వుడ్ అన్నారు. కేసు

రుజువయినప్పుడు నిందితునికి జైలుశిక్ష విధిగా వేయాలని బ్రిటీసు ప్రధాన మంత్రి మార్గరెట్ థాచర్ 1982 జనవరిలో పార్లమెంటులో ప్రకటన చేశారు.

తే 19-1-'82న బ్రిటిష రేడియోలో 3 'రేప్' కేసుల వార్తలు చదివారు. పత్రికలు కోర్టులను పోలీసులను విమర్శించాయి. వ్యభిచారిణులైన స్త్రీలు వారే మానభంగాన్ని ఆశిస్తారని, పొట్టిలాగులు వేసుకుంటున్నందువల్ల, రాత్రిళ్ళు బయటికి వెళ్ళినందువల్ల స్త్రీలు ఆ నేరాలకు తావు ఇస్తున్నారని పోలీసులు, న్యాయమూర్తులు చేసే వ్యాఖ్యలపై పత్రికలు సంపాదకీయాలు వ్రాశాయి. ఈ వార్తలు స్త్రీలను ఆందోళన పరిచాయి. ఇప్స్విచ్‌లో మహిళలు 3 వేల సంతకాలు సేకరించారు. జరిమానావేసి నిందితుడిపై జాలి చూపిన న్యాయమూర్తి కోర్టుకు మహిళలు వెళ్ళి అసమ్మతి పత్రం ఇచ్చారు. థేమ్స్ వాలీ పోలీసుస్టేషను మహిళలు ఆందోళన యాత్ర జరిపారు. లీడ్సులో కోర్టువద్ద పికెటింగు చేశారు. నేలాండు స్త్రీలు పిటీషను పంపారు. షెఫీల్డు, లండను, గ్లాస్గో నగరాలలో స్త్రీలు రాత్రిపూట ఊరేగింపులు జరిపారు. జాతీయ అసమ్మతి ప్రదర్శన జరిగింది దేశం అంతటా.

భారతదేశంలో మానభంగాల సంఖ్య రోజురోజుకూ పెరుగుతున్నది. పట్టణాలలోనూ, పల్లెలలోనూ సాగుతున్నాయి. ఎక్కువగా పేద స్త్రీలు, అనాధ స్త్రీలు ఈ అన్యాయానికి గురి అవుతున్నారు. అందులోనూ పదునెన్మిది సంవత్సరాల లోపు వయస్సుకల బాలికలపై ఈ అత్యాచారం మెండుగా ఉన్నది. నేరస్తుడు తనకు బలి అయ్యే స్త్రీ దేహదార్ఢ్యము, మనస్థైర్యం లేనిదిగా ఉండాలని ఆశిస్తాడు.

మానభంగానికి పూనుకునే పురుషుడి మానసిక స్తితి విపరీతంగా ఉంటుంది. నిజానికి అతడు లైంగిక సుఖాన్ని ఆశించినట్లు కన్పించదు. తనను తిరస్కరించిన స్త్రీని శిక్షించాలనే సంకల్పము, తన కోరికను ఎవరో ఒక మహిళ కాదంటే స్త్రీ జాతిపై ద్వేషం పెంచుకొని స్త్రీలను బాధించాలనే కసి వృద్ధి చేసుకుని ఏ స్త్రీ అబలగా కనిపిస్తే ఆ వనితపై అత్యాచారం చేయ తలచడం, వస్తుతః అతనిలో ఇతరులను బాధించే మనస్తత్వం (సాడిజం) చోటుచేసుకోవడం, సినిమాలలో చూసిన 'రేప్ సీను'ను అనుకరించ ఇచ్ఛగించడం, అదేదో 'తమాషా అనుభూతి' అని భావించి దానికోసం తహతహ

లాడడం ఇలాంటివి ఈ మానభంగాల కేసులకు దారితీస్తున్నాయి. ఈ కారణాలను అన్నింటిని మించినది మరొకటి ఉంది. భారతదేశంలో స్త్రీ పురుషుల వేర్పాటు ఎక్కువగా ఉంది. స్త్రీ పురుషులతో కలసి కార్యాలయాల్లో, ఫ్యాక్టరీలలో పని చెయ్యకపోవటం సరికదా తలుపు చాటునుండి పురుషునితో మాట్లాడే ప్రాంతాలు దేశంలో బాల ఉన్నాయి. తల్లి, సోదరి, పినతల్లి లాంటి దగ్గర బంధుత్వం ఉన్న స్త్రీలు తప్ప కుటుంబంలోని పురుషులకు కన్పించరు. స్త్రీకి పురుషుడు, పురుషునికి స్త్రీ స్నేహితంగా ఉండటం బహు అరుదుగా జరిగే సంఘటన. అదీగాక దేశ ప్రజలకు సెక్సుకు సంబంధించిన పరిజ్ఞానం బహు స్వల్పం. స్త్రీ పురుష దేహస్వరూపం ప్రజలకు తెలియదు. అందులో ముఖ్యంగా స్త్రీ శరీర స్వభావం పురుషునికి, పురుషుని అంగ నిర్మాణం స్త్రీకి అసలే తెలియదు. దాంతో కుతూహలం రేకెత్తుతుంది ఇరువురిలో. కాగా పురుషాధిక్య సమాజంలో తన కుతూహలాన్ని తీర్చుకోవడానికి పురుషునికి అవకాశాలు మెండు. పరాయి స్త్రీ - యౌవనవతి, అందగత్తె అయితే మరీ - కన్పిస్తే మింగబోయినట్లు చూస్తారు చాలమంది పురుషులు. ఈ ప్రవర్తనను మనం తరచూ సమాజంలో చూస్తూనే ఉన్నాం. కాగా ఈ 'తేరిపార జూడటం' స్త్రీకి ఎంత ఇబ్బంది కలుగజేస్తుందో ఆ పురుషులకు తెలియదు; తెలిసినా పట్టించుకోరు. ఇలాంటి పురుషులు తమకు అవకాశం లభిస్తే మానభంగానికి పూనుకునే మన స్తత్వంతో ఉంటారు.

పురుషులలో దుష్టులు చెప్పేది ఏమంటే మానభంగం ''సామాన్య విషయం'' అని. అది వారి దృష్టిలో అసాధారణ విషయం కాదట. పట్టుబడే వరకూ నిందితుడు అందరిలాగానే ఉంటాడు. అన్ని వర్గాలలోనూ, వివాహితులలోనూ ఉంటారు. నిందితులు సాధారణ మానసిక పరీక్షల్లో మామూలుగా ఉన్నట్లు కన్పడతారు.

స్త్రీలు ఈ విషయం తీవ్రమయినదిగా భావిస్తున్నారు. ''మానభంగం'' తమాషా అని భావించే పురుషులు ఇంకా చాలమంది ఉన్నారు. ఆందోళన జరిగినప్పుడు పెద్దమనుష్యులుగా నటించే పురుషులు రంగం మీదికి వస్తారు. ఆలోచిస్తామంటారు; కాలహరణకు పూనుకుంటారు. ఇలా నిందితులకు సరి అయిన శిక్ష పడకుండా పురుషులు రెండు విధాలుగా కృషి చేస్తున్నారు.

*కుటుంబంలో నేరాలు*

ఈ కేసులు కుటుంబాలలో జరిగినప్పుడు అవి వెలుగు చూడవు. మేనమామ, మేనమామ కుమారుడు, తల్లి రెండోమగుడు తరుచుగా ఈ అత్యాచారానికి పూనుకుంటారు. ఇటీవలనే యుక్తవయస్సు వచ్చిన బాలికను తమకు బలిపశువుగా వారు ఎన్నుకుంటారు. తండ్రి తన కూతురుపై అఘాయిత్యం చేసిన సంఘటనలు కూడా లేకపోలేదు. కుటుంబ గౌరవం పేరుతో తండ్రి నేరస్తుడయిన సందర్భాలలో తల్లికి బాలికకూ పోషణాదులు జరగవని భయపడి ఈ దుర్మార్గాలను పది మందికి తెలియనీయరు. ఒక్కొక్కప్పుడు తమ ఇంటికి చుట్టపుచూపుగా వచ్చిన బంధువు చేతిలో బలి అవుతారు ఇంటి బాలికలు. నేరస్తులందరూ గౌరవనీయులైన పెద్దమనుష్యులుగా చెలామణి అవుతారు అది వారికి చక్కని ముసుగు; రక్షణ కూడాను. ఆ 'పెద్దరికం'తో వారు పెద్ద ఘోరకార్యానికి ఒడికట్టారు.

## వివిధ దేశాలలో శిక్షల పద్ధతులు

నార్వే, స్వీడను, ఫిన్‌లెండు లలో ఈ నేరానికి శిక్ష ఎక్కువగా ఉంటున్నది. హాలెండులో శిక్ష చాల తక్కువగా ఉంటుంది. అక్కడ పెళ్లయినంతవరకు జైలుశిక్ష ఉండదు. ఫ్రాన్సులో శిక్ష 5 నుండి 10 సంవత్సరాలు. నేరానికి గురిఅయిన వారు బాలికలయినా, ముద్దాయిలు ఆయుధాలు ధరించి ఉన్నా శిక్ష పెరుగుతుంది. స్త్రీలపరంగా ఆలోచిస్తే అమెరికా సంయుక్త రాష్ట్రాలూ, పశ్చిమ జర్మనీ, స్వీడనుకన్న బ్రిటను వెనుకబడి ఉన్నది. శిక్ష విషయంలో బ్రిటీషు ప్రధానమంత్రి థాచర్ గట్టిగా మాట్లాడినా త్వరపడి శాసనం మార్చబోమని బ్రిటిషు ప్రభుత్వం ప్రకటించింది. ఆందోళనను మాత్రం గమనించిందట!

భారతదేశంలో, మానభంగ నేరాలకు శిక్షలను 1983లోని 43వ క్రిమినల్ లా సవరణ చట్టం క్రింద మార్చారు. వాటిని పెంచారు. ప్రత్యేక పరిస్థితుల్లో ప్రత్యేకంగా శిక్షలను పేర్కొన్నది శాసనం. ప్రత్యేక శిక్షలు సెక్షను 376 (2)లో వివరించబడినాయి. విడిగా ఉన్న భార్యను మానభంగం చేసిన నేరానికి శిక్ష సెక్షను 376 (ఎ)లో పేర్కొనబడినవి. నేరస్తుకు ప్రభు

త్రోద్యోగి అయితే 376 (బి) ప్రకారం, జైలు అధికారి అయితే 376 (సి) ప్రకారం, ఆస్పత్రి అధికారి అయితే సెక్షను 376 (డి) లెక్కన శిక్షార్హులు అని స్పష్టీకరించబడినది

సాధారణంగా శిక్ష పది సంవత్సరాల వరకు కారాగారవాసము మరియు జరిమానాగా ఉండేవి 1983 వరకు. క్రొత్త శాసనం ప్రకారం జైలుశిక్ష ఏడు సంవత్సరాలకు తక్కువ లేకుండా ఉండాలి. అది జీవితకాలపు ఖైదు వరకు గాని పది సంవత్సరాల జైలు శిక్షగా కాని ఉండవచ్చును. అదీగాక జరిమానా కూడా విధింపబడవచ్చును. అయితే నేరానికి గురిఅయిన స్త్రీ నిందితుని భార్య అయివుండి ఆమె వయస్సు 12 సంవత్సరాల లోపు కాకపోతే 2 సంవత్సరాల వరకు జైలు శిక్ష కాని లేక జరిమానాకాని లేక రెండూ కాని వేయవచ్చును. అంటే భార్యయెడ అత్యాచారం చేసిన వ్యక్తి తక్కువ శిక్షతో తప్పించుకొని పోతున్నాడు. బాల్య వివాహాలు ఇంకా సాగుతున్న ఈ దేశంలో ఇలాంటి సూత్రం అమలులోఉంటే బాల్య వివాహ నిషేధ కార్యక్రమం నిష్ఫలం అవుతుంది. తగిన కారణాలు, ప్రత్యేక కారణాలు ఉంటే కోర్టువారు 7 సంవత్సరాల లోపు జైలు శిక్షకు నేరస్తుని పాత్రుడిని చేయవచ్చని మరొక మినహాయింపు ఉన్నది. ఇలాంటి మినహాయింపులను ఆసరాగా తీసుకొని పురుషాధిక్య సమాజంలో విశ్వాసం కల న్యాయమూర్తులు తక్కువ శిక్షలు వేస్తే ఆశ్చర్య పడవలసిన అవసరం లేదు. ప్రభుత్వ విధానాలలో లోపాలు, సమన్వయ రాహిత్యం ఉన్నందువల్ల ఇలాంటి అవకతవకలు జరుగుతున్నాయి.

తను ఉద్యోగం చేసే పోలీసు స్టేషను పరిధిక్రిందికి వచ్చే ప్రాంతంలో పోలీసు ఆఫీసరు నేరం చేస్తే లేక ఏ పోలీసు స్టేషను ఆవరణలోనైనా పోలీసు ఆఫీసరు నేరం చేస్తే లేక తన తాబేదారు అయిన పోలీసు ఆఫీసరు అధీనంలో ఉన్న స్త్రీని పోలీసు ఆఫీసరు మానభంగం చేస్తే అతనికి పది సంవత్సరాలకు తక్కువలేని జైలుశిక్ష. ఆ జైలుశిక్ష జీవితకాలపు ఖైదుకూడా కావచ్చును. మరియు జరిమానా కూడా విధింపబడవచ్చును. ఏ ప్రభుత్వోద్యోగి అయినా తన అధీనంలో, లేక తన తాబేదారు అధీనంలో ఉన్న స్త్రీపై తన అధికార పదవిని వినియోగించుకొని అత్యాచారం (మానభంగం) చేస్తే పైన వివరింపబడినట్లు పోలీసు ఆఫీసరుకు వేసే శిక్షయే అతనికి కూడా వేయాలి. జైలు, రిమాండు హోం (శరణాలయం) శాసనాల ప్రకారం నెలకొల్పబడిన అధీన

ప్రదేశాలు, లేక స్త్రీ సదనాలు, లేక బాలికల ఆశ్రయ స్థానాలు వీటిల్లో ఉండే స్త్రీలపై ఆయా సంస్థల నిర్వహణాధికారులు కాని సిబ్బంది కాని తమ అధికార పదవులను ఆసరగా తీసుకుని ఇలాంటి నేరం చేస్తే వారికీ అదే శిక్ష. అలాగే ఆస్పత్రిలో ఉన్న వారిపై ఆస్పత్రి అధికారులు, సిబ్బంది తమ అధికార స్థానాలను వాడుకుని నేరం చేస్తే వారికీ అలాంటి శిక్షయే. గర్భిణీస్త్రీపై మానభంగ నేరానికి పూనుకున్న పురుషునికి పైచెప్పిన రీతిగా శిక్ష వేయాలి. కొంతమంది వ్యక్తులు ఒకే ఉద్దేశ్యముతో వ్యవహరిస్తూ అందులో ఒకరు కాని అంత కన్నా ఎక్కువ మంది కాని ఒక స్త్రీని మానభంగం చేస్తే అది 'మూక ఉమ్మడి మాన భంగం' క్రింద పరిగణింపబడుతుంది. అందరూ నేరస్తులవుతారు. మూక ఉమ్మడి మానభంగం విషయంగా నేరం తీవ్రమయినదిగాపరిగణిస్తారు. పైనచెప్పినపోలీసు ఆఫీసరు, ప్రభుత్వోద్యోగి, జైలు అధికారి వగైరాలు, ఆస్పత్రి అధికారి వగైరాలకు కేటాయించబడిన పది సంవత్సరాలకు తక్కువ కాని జైలు శిక్షను మూక ఉమ్మడి మానభంగపు కేసులో ప్రతి ముద్దాయికి విధించ వచ్చును. జీవిత కాలపు ఖైదు కూడా వేయవచ్చును. అంతేగాక జరిమానా కూడా చెల్లించమని ఉత్తరువు చేయవచ్చును. బాలికల అనాధా శ్రమం, నిరాదరణకు గురి అయిన స్త్రీలకు ఏర్పరచిన సదనం, బాలికాసదనం, వితంతుశరణాలయం, లేక ఏ పేరులో పిలిచినా స్త్రీల కోసం ఆడపిల్లల కొరకు నిర్ధారించబడిన ఏ సంస్థ అయినా స్త్రీల మరియు బాలికల సంస్థగా పరిగణించబడును. వైద్యం కోసం వచ్చే రోగుల కొరకు, వైద్యం తరువాత ఆరోగ్యాన్ని కోలుకోటానికి, లేక జీవితంలో పునరావాస కల్పన కొరకు ఉద్దేశింప బడిన సంస్థలన్నీ 'ఆస్పత్రి' అనే పదం క్రిందికి వస్తాయి. ఆస్పత్రి ఆవరణ అంతా ఆస్పత్రి క్రిందనే లెక్క. కనుక వైద్యాలయాలలో, పునరావాస సంస్థలలో, ఆరోగ్య కేంద్రాలలో, వాటి ఆవరణలలో అధికారులు, సిబ్బంది నేరాలు చేస్తే వాటిని తీవ్రమయినదిగా పరిగణించటం జరుగుతుంది. ఈ నిబంధనలన్నీ నిస్సహాయులను రక్షించటానికి తయారు చేసినవి.

*తక్కువశిక్షలు:-* కోర్టు ఉత్తరువు పొంది లేక ఆచారం ప్రకారం, లేక సంప్రదాయాన్ని బట్టి భర్త నుండి విడిగా కాపురం చేస్తున్న భార్య పొందును ఆమె భర్త ఆమె సమ్మతి లేకుండా పొందితే అతనికి రెండు సంవత్సరాల వరకు జైలు శిక్ష మరియు జరిమానా వేయాలి.

ప్రభుత్వోద్యోగి తన అధీనంలోగాని తన తాబేదారు అధీనంలోగాని ఉన్న స్త్రీని తన అధికార పదవిని ఆసరగా తీసుకొని తనతో లైంగిక సంపర్కం నెరపమని ప్రోత్సాహం చేసి లేక లోబరుచుకొని ఆమెతో సంభోగం చేస్తే, అది మాన భంగం క్రిందికి రాని పక్షంలో, అతనికి 5 సంవత్సరాల వరకు జైలు శిక్ష మరియు జరిమానా విధించ బడుతుంది. జైలు, రిమాండుహోం, అధీన ప్రదేశం, బాలికా సదనం, స్త్రీ సదనంల ఉన్నతోన్నత అధికారి కాని మేనేజరు కాని పై చెప్పినట్లు నేరంచేస్తే అతనికి అలాంటి శిక్షలే ఉంటాయి. జైలు, రిమాండుహోం, బాలికా సదనం, స్త్రీ శరణాలయం ఇలాంటి సంస్థలలో నివసించే స్త్రీలపై తన ఉద్యోగస్థాయి వల్ల పెత్తనం, అదుపు కల్గిన ప్రతి వ్యక్తి సూపరింటెండెంటు ( ఉన్నతోన్నత అధికారి ) గా పరిగణింపబడును. అంటే జైలరు, డిప్యూటీ జైలరు, గార్డు, వార్డెను, డిప్యూటీ వార్డెను, మెన్ అధికారి వీరంతా అలాంటి వారే. ఇక ఆసుపత్రి నిర్వాణ బాధ్యత ఉన్నవ్యక్తి, సిబ్బందిలో ఉన్న వ్యక్తి ఎవరైన పైన ఉదహరింపబడినట్లు తమ అధికారాన్ని వినియోగించి పైచెప్పిన నేరాన్ని చేస్తే వారికీ 5 సంవత్సరాల వరకూ శిక్ష మరియు జరిమానా ఉంటాయి. ఇదంతా సెక్షనులు 376(2), 376(ఎ), 376(బి), 376(సి), 376(డి) లో నమోదు కాబడింది. ఇవి క్రొత్తగా వచ్చిన నిబంధనలు.

చదవడానికి చూడటానికి శాసనాలు బాగానే ఉన్నాయి. కాని శిక్షలు పెద్దవిగా ఉన్నంత మాత్రాన నేరాలు చేసే ప్రజలు భయపడుతారను కోవటం భ్రమ. నేరస్తులను ఏహ్య భావంతో చూసే ప్రజాభిప్రాయం, వారిని పశుప్రాయులుగా పరిగణించే ప్రజా దృక్పథం, ఈ నేరాలను తీవ్రంగా పరిగణించే న్యాయమూర్తులు, ఈ నేరాల విషయమై శ్రద్ధ వహించే ప్రజా సంఘాలు అందులో ముఖ్యంగా మహిళా సంఘాలు, స్త్రీజాతికి న్యాయం చేకూర్చాలనే రాజకీయ సంకల్పం ప్రభుత్వాలు కలిగి ఉండడం, స్త్రీలపై జరిగే అత్యాచారాలను రూపుమాపాలనే ధృడాభిప్రాయం పత్రికలకు ఉండటం ఇవన్నీ లేకపోతే నేరస్తులు ఎప్పటిలాగే తప్పించుకొని పోతారు. చివరకు చెప్పినా ముఖ్యమైననది ఒక అంశం ఉంది. అది సినిమా నిర్మాతల విషయం. మాన భంగాలను చిత్రాలలో తరుచుగా, అసందర్భంగా, చూపించి, ప్రజలను తప్పుడు మార్గాన పట్టిస్తూ, పైసలు దండుకునే చిత్ర నిర్మాతలు నింద్యులు.

వారి విషయమై తగు విధంగా ప్రజలూ, ప్రభుత్వాలు వ్యవహరించడం అత్యవసరం. ఇలా సర్వతోముఖ ప్రయత్నం సాగిననాడే ఈ శిక్షలను పెంచడ వల్ల ప్రయోజనం ఒనగూడుతుంది.

## కోర్టులో విచారణ విధానం:-

న్యాయమూర్తి కోరితే తప్ప ఫిర్యాది తన లైంగిక జీవితానికి సంబంధించిన వివరాలు తెలుపనక్కరలేదని బ్రిటీషు దేశాంగశాఖ పోలీసులకు ఉత్తరువులు పంపుతుందని ఒక వార్తా ప్రకటన జరిగింది. భారతదేశంలో ఫిర్యాది లైంగిక జీవితాన్ని గురించి ముద్దాయి ప్రశ్నలు వేయవచ్చు. ఆమె వ్యభిచారిణి అనే అంశాన్ని వెలికి తీయవచ్చు. వ్యభిచారిణి అయితే ఆమెపై ఎవరైనా అత్యాచారం చెయ్యవచ్చనే అభిప్రాయం దాని వెనుక దాగిఉంది. అంటే వ్యభిచారిణి అందరి ఆస్థి అన్నమాట. ఇది స్త్రీలను అవమానించే ఆలోచనా ధోరణి. మన దేశంలో శాసనం ఈ విషయంగా సవరణ కావలసిఉంది.

"అచ్చంగా ఫిర్యాది సాక్ష్యంపై ఆధారపడి ముద్దాయికి శిక్ష వేయవచ్చా" అనే ప్రశ్న మామూలుగా ఉదయిస్తుంది. వేయవచ్చని మన దేశంలో కోర్టు తీర్పులు వచ్చాయి. కాగా 1982 జూలై వరకు ఇజ్రాయిల్ శాసనం ప్రకారం ఫిర్యాది సాక్షాన్ని బలపరిచే ఇతరుల సాక్షం ఉండాలి. ఇపుడు శాసనాన్ని సవరించారు. తత్ఫలితంగా ఒక్క ఫిర్యాది సాక్షాన్ని బట్టే-నమ్మితే- ముద్దాయిని నేరస్తుడుగా పరిగణించి శిక్ష వేయవచ్చు.

మధుర అనే అమ్మాయి కేసులో బొంబాయి హైకోర్టు ఒక తీర్పు ఇచ్చింది; దానిని ఖాయపర్చింది సుప్రీంకోర్టు ఆ అమ్మాయి సమ్మతిస్తే ఆమె పొందును పోలీసులు అనుభవించారని కోర్టులు రాశాయి. "ఆమె సమ్మతించలేదు. ఆమెను భయపెట్టిన సందర్భంలో, బెదరింపువల్ల ఆమె మనస్సు చీకాకు అయిన పరిస్థితుల్లో ఆమె వ్యతిరేకించి, పెనుగులాడ లేకపోయింది. అందువల్ల ఆమె ఒంటిపైగాని, అత్యాచారం చేసిన పోలీసు శరీరంపైగాని గాయాలు లేవు. అంత మాత్రాన ఆమె సమ్మతిపైననే ఆ అకార్యం జరిగిందనడం హాస్యాస్పదం" అని మహిళోద్యమ కార్యకర్తలు

వాదించారు సభలు జరిపారు; ఊరేగింపులు లేవదీశారు. అసమ్మతి ప్రదర్శనలు చేశారు; ఆందోళన ఉధృతంగా సాగింది. సుప్రీంకోర్టు తీర్పును పునరాలోచన చేయమని పిటీషను దాఖలు చేసారు. శాసనాన్ని సవరిస్తామని కేంద్ర ప్రభుత్వ న్యాయశాఖ ముందుకు వచ్చింది. బిల్లు తయారుచేసింది. ఆందోళన సద్దుమనిగింది. అంతే, ప్రభుత్వం నిశ్చింతగా మళ్ళీ మామూలు పద్ధతిలో నిద్రపోయింది చాలాకాలం. చివరకు 1983 లో శాసనం మార్పు చేయబడింది.

1983 లోని 43 వ శాసనం ద్వారా మానభంగ నేరానికి సంబంధించిన అనేక అంశాలను పార్లమెంటు మార్చింది. సవరించబడిన భారత శిక్షా స్మృతి సెక్షన్ 375 ప్రకారం, ఏ పురుషుడు అయినా ఒక స్త్రీనికాని ఆ స్త్రీ ఆసక్తి కనబరిచే మరియొక వ్యక్తిని కాని చంపుతానని బెదరించి లేక ఘాత కలుగజేస్తానని భయపెట్టి ఆమె సమ్మతిని తీసుకొని ఆమెను పొందినా అది మానభంగ నేరం క్రిందనే లెక్క. మధుర కేసువల్ల కలిగిన భయ సందేహాలను తొలగించటానికి ఇది ఉద్దేశింపబడింది.

పోలీసుస్టేషను అధిపతి లేక కేసును దర్యాప్తు చేస్తున్న పోలీసు ఆఫీసరు అనుమతి లేక ఆ నేరానికి బలియైన స్త్రీ, ఆ స్త్రీ చనిపోయినా లేక మైనరయినా ఆమె దగ్గర బంధువు సమ్మతిని వ్రాత పూర్వకంగా ఇస్తే తప్ప నేరానికి గురి అయిన స్త్రీ పేరు వెలువరించరాదు. అచ్చువేయరాదు. దగ్గర బంధువులు కేంద్ర ప్రభుత్వం లేక రాష్ట్ర ప్రభుత్వముల చేత గుర్తింపబడిన సంక్షేమ సంఘానికి మాత్రమే ఆమె పేరు వెల్లడి చేయుటకు అనుమతి ఈయనగును. అలా అనుమతి లేకుండా ఆమె పేరును బహిర్గతం చేసిన వారికి 228A సెక్షన్ ప్రకారం రెండు సంవత్సరాల వరకు జైలు శిక్ష మరియు జరిమానా విధించవచ్చును.

భారత శిక్షాస్మృతి 376, 376-A, 376-B, 376-C, 376-D సెక్షన్ల క్రిందికి వచ్చే నేరాల విచారణ రహస్యంగా జరగాలి. అంటే బహిరంగంగా జరుగదన్నమాట. పార్టీలలో ఎవరో ఒకరు అభ్యర్థిస్తే వారి కోరికను మన్నించి మరొక వ్యక్తిని కోర్టులోకి రానీయటానికి లేక కోర్టులో ఉండటానికి అనుమతి ఇవ్వటానికి కోర్టువారికి అధికారం ఉన్నది. కోర్టులో జరిగే విచారణ

కాని వ్యవహారం కాని కోర్టువారి అనుమతి లేకుండా ఏ వ్యక్తి అచ్చు వేయ టానికి లా ప్రకారం వీలులేదు; ప్రచురించ వీలులేదు. ఈ అంశాలు సెక్షన్ 327 లో విశదీకరించబడినాయి.

సాక్ష్యానికి సంబంధించిన శాసనం లోని 114 వ సెక్షన్‌కు తోడుగా 114A సెక్షన్ వచ్చింది 1983లో. సెక్షన్ 376 లోని (a), (b), (c), (d), (e), (g) క్లాజులలో దేనిలో ఒక దాని క్రిందనైనా వచ్చే నేరం సంద ర్భంగా ముద్దాయి నేరానికి గురి అయిన స్త్రీతో లైంగిక సంపర్కం పెట్టుకు న్నట్లు రుజువయితే, ఆమె అనుమతించిందా లేదా అనే విషయం నిర్ణయం కావలసివచ్చినపుడు, ఆమె తను సమ్మతించలేదని కోర్టు ఎదుట సాక్ష్యం చెప్తే ఆమె సమ్మతించనట్లే కోర్టువారు మున్ముందుగా భావించవలెను. ఇది మేలైన నియమం.

హైకోర్టు, సుప్రీంకోర్టుల తీర్పును ప్రకటించడం నేరం కాదని 228A సెక్షన్‌లో స్పష్టీకరింపబడినది.

## వివాహ బంధంలో మానభంగం

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 36 రాష్ట్రాలలో "లా" చాలా విడ్డూరంగా ఉంది. భర్త భార్యను మానభంగం చేస్తే కేసు లేదు. ఈ శాసనాల వెనుక ఆధారంగా ఉన్న న్యాయసూత్రాన్ని 17వ శతాబ్దంలో ప్రధాన న్యాయమూర్తి మాచ్యూహెల్ 'ప్రవచనం' చేశాడు. "తను లా ప్రకారం వివాహమాడిన భార్యను మానభంగం చేశాడని భర్తపై నేరం మోపడానికి వీలులేదు. ఈ విషయంగా, ఒప్పందం వల్లనూ, పరస్పర సమ్మతితోను భార్య తనను భర్తకు సమర్పించుకున్నది. ఆ ఒప్పందాన్ని ఆమె రద్దుపరుచుకోటానికి వీలులేదు" ఇది ఆ న్యాయం సూత్రం. దీనిని కోర్టులు మరల 18వ శతాబ్దంలో ధృవపరచాయి.

బ్రిటనులో శాసనాన్ని సవరించమని 1980 లో "క్రిమినలు లా రివిజను కమిటీ" వారు ప్రతిపాదించారు. భర్త భార్యను బలవంతంగా అనుభవిస్తే అది నేరంగా పరిగణింపబడాలని ఆ సిఫారసు సారాంశం. దానిని మహిళా సంఘాలు బలపరిచాయి. కాని శారీరక హింస లేకపోయినా

నేరంగా పరిగణించాలని బ్రిస్టలు నగరంలోని ఒక మహిళా సంఘం విజ్ఞప్తి పత్రం సమర్పించింది. "వివాహం కాకుండా పురుషునితో దాంపత్య జీవితం గడుపుతున్న స్త్రీకి ఈ నాటి శాసనం ప్రకారం రక్షణ ఉంది. ఆమె సమ్మతి లేకుండా బలవంతంగా ఆమెను ఎవరూ పొందరాదు. కాని ఆ రక్షణ భార్యకు లేదు; కోర్టు ఉత్తరువు లేకుండా భర్తకు దూరంగా విడిగా ఉంటున్న భార్యకు రక్షణ లేదు. ఇది శోచనీయం". అని వారు వాదించారు.

15 సంవత్సరాల వయస్సు నిండిన భార్యతో ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా, ఆమె సమ్మతి లేకుండా లైంగిక సంపర్కాన్ని భర్త నెరపితే అది నేరం కాదు. ఇది భారతదేశంలో అమలులో ఉన్న శాసనం. వివాహమపుడు తనతో లైంగిక సంబంధం పెట్టుకోడానికి భార్య భర్తకు ఒక్కసారిగా అనుమతి ఇచ్చినదట! కాగా భార్యకు పదిహేను సంవత్సరాలు నిండకపోతే అది మానభంగ నేరము. శిక్ష విషయంలో భర్తకు రాయితీ ఉన్నది. ఆమె పన్నెండు సంవత్సరాల లోపు వయస్సుకల స్త్రీ కాకపోతే అతనికి 2 సంవత్సరాల వరకు జైలు శిక్ష లేక జరిమానా లేక రెండూ విధించవచ్చును. భార్యకు పన్నెండు సంవత్సరాల వయస్సు నిండకపోతే భర్తచేసిన నేరానికి అందరికి వలె 7 సంవత్సరాలకు తక్కువ కాకుండా పది సంవత్సరాలు కాని జీవిత కాలం వరకు గాని జైలు శిక్ష మరియు జరిమానాకు అతడు పాత్రుడు అవుతాడు. ఇదంతా భారత శిక్షా స్మృతి 376 సెక్షనులో వివరించబడింది. భార్య భర్తనుండి వేరుపడి కోర్టు ఉత్తరువుల ప్రకారం కాని, ఆచారము లేక సంప్రదాయం వలన కాని విడిగా నివసిస్తుంటే ఆమె సమ్మతి లేకుండా భర్త ఆమెను లైంగికంగా పొందితే ఆ నేరాని అతనికి 2 సంవత్సరాల వరకు జైలు శిక్ష మరియు జరిమానా విధింప బడవచ్చును. ఈ అంశము సెక్షను 376 A లో స్పష్టీకరించబడినది. 376వ సెక్షను సవరణ 1983లో వచ్చిన 43వ శాసనం ద్వారా అమలులోకి వచ్చినది. 376A కూడా ఆ శాసనం ద్వారానే ప్రవేశ పెట్టబడినది.

విడిగా ఉన్నపుడు భార్య అనుమతి లేకుండా భర్త ఆమెను బలవంతంగా పొందడం నేరమని తేల్చి కూడా తక్కువ శిక్షను నిర్ణయించటం

సముచితం కాదు. నిజానికి ఇది స్త్రీ జాతికి అన్యాయం. వివాహ బంధంలో ఉన్న భార్య భర్తతో ఒక ఇంటిలో కాపురం చేస్తున్నా, లేక విడిగా వేరు ఇంటిలో కాపురం ఉంటున్నా దుర్మార్గపు భర్తల బారినుండి ఆమెకు రక్షణ లేదు. భార్య భర్తయొక్క వస్తువు అనే భావం శాసన నిర్మాతలకు ఇంకా వదలనందుననే ఇలా జరిగింది. భారతదేశ ప్రతిష్టను ఇలాంటి నియమాలు దిగజారుస్తున్నాయి. ఈ అక్రమ సూత్రాలు ఎంత త్వరగా మారితే అంత మంచిది.

## రేప్ కేసులలో న్యాయం :-

ఈ విషయమై బ్రిటనులోని "గార్డియను" దినపత్రిక తే 28-1-1982న చేసిన వ్యాఖ్యానం గమనార్హం. 'అనేక మానభంగపు కేసుల్లో గాయాలు ఉంటాయి; ఘాతలు ఉంటాయి. వాటికి శిక్షగా జీవిత కాలపు ఖైదు కూడా పేర్కొన్నారు. అయినా మానభంగం కేసులో దృష్టి మళ్ళించి చాల ఉద్వేగపూరిత వాతావరణాన్ని సృష్టిస్తున్నారు. ప్రాసిక్యూషన్ వారు తదితర విషయాలపై ఎందుకు నొక్కిపెట్టరు? స్త్రీ అంగీకరించిందా లేదా అని కోర్టువారు తేల్చాలట. కాని మామూలు ఘాతకేసులో "నీవు ఇష్టపడి దెబ్బలు తిన్నావా?" అని అడగరేం? వీధిలో క్రిందికి త్రోయబడిన మనిషికి 'లా' సహాయం చేస్తున్నది. కాని మానభంగానికి గురి అయిన స్త్రీకి న్యాయం జరగడం ఎంతో కష్టం? ఎందువల్ల? ఈ పత్రిక లేవనెత్తిన ప్రశ్నలు మౌలికమయినవి; సందర్భోచితమయినవి. అంతే కాదు అవి ఆలోచనా ప్రేరకాలు.

భారత శిక్షా స్మృతి 372 సెక్షను ప్రకారం స్త్రీ యొక్క సమ్మతి లేకుండా ఆమెతో సంభోగిస్తే స్త్రీని చెరచిన నేరం అవుతుంది. సమ్మతి లేదని ఎలా రుజువు చేయాలి? నేరానికి గురి అయిన వ్యక్తి చెప్తే చాలదా? ఆమె శరీరంపై గాయాలు, గాట్లు, ఘాతలు లేక పోతే, ఆమె సమ్మతించినట్లేనా? ఆమె పెనగులాడితే విధిగా ఆమెకు గాయాలు తగలాలా? ఆమె దిగ్భ్రాంతికి లోనయి లేక మత్తులో ఉండి లేక తీవ్రమయిన భయోత్పాతానికి లోనయి ఆమె పెనగులాడకపోతే ఆమె సమ్మతించినట్లేనా? ఈ ప్రశ్నలకు తగిన

సమాధానం చెప్పటానికి మానభంగం అంటే ఏమిటో భారత శిక్షా స్మృతి సెక్షను 375ను తిరిగి వ్రాశారు 1983వ సంత్సరపు 43 వ శాసనం ద్వారా.

ఈ దిగువ సందర్భాలలో మానభంగ నేరం జరిగినట్లే లెక్క. i) ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా; ii) ఆమె సమ్మతి లేకుండా; iii) ఆమెకు, ఆమె శ్రద్ధచూపే మరియుక వ్యక్తికి ప్రాణాపాయం కలుగ జేస్తామని లేక ఘాత కలుగజేస్తామని బెదరించి ఆమె సమ్మతిని పొందితే; iv) నేరం చేసిన వ్యక్తి తన భర్తయని ఆమె విశ్వసించి ఆమె సమ్మతించిన సందర్భంలో నేరస్తునికి తను ఆమె భర్త కాదని తెలిసియున్నపుడు; v) ఆమె మనశ్చాంచల్యం వల్లగాని, మైకంలోను లేక మత్తులోను ఉండినందువలన గాని, నేరస్తుడు స్వయంగా గాని మరియొక వ్యక్తి ద్వారాగాని మనిషిని స్థాణువును చేసేది లేక అనారోగ్యం కలిగించేది అయిన పదార్థాన్ని ఆమె తినేటట్లు చేసినపుడు, ఆమె తను అతనితో పొందుకు ఇచ్చిన సమ్మతి యొక్క స్వభావంగాని ఫలితాలు గాని ఆమెకు అర్థమయ్యే స్థితి ఆమెకు లేక ఉండి ఆమె సమ్మతించినా; vi) ఆమె పదునారు సంవత్సరములు నిండక యున్న బాలిక అయితే ఆమె సమ్మతించినా లేక సమ్మతించక పోయినా;

పురుషుడు స్త్రీతో నెరపిన లైంగిక సంపర్కం మానభంగమే; అది నేరం, పురుష మర్మావయం స్త్రీ శరీరంలో ప్రవేశించుట నేరం యొక్క ముఖ్యాంశం. భార్యకు పదిహేను సంవత్సరముల వయస్సు దాటి యుంటే ఆమెతో భర్తయెక్క లైంగిక సంపర్కము మానభంగ నేరం క్రిందికి రాదు.

సెక్షను 114 (ఎ) ప్రకారం 'నేను సమ్మతించలేదు, అని స్త్రీ చెప్పినపుడు ఆమె సమ్మతించలేదనే కోర్టువారు భావించవలెను. కాగా ఆమె సమ్మతించినదని ముద్దాయి ఉత్తర సాక్ష్యం ఇప్పించ వచ్చును. ఏదైనా ఇది కొన్ని పరిస్థితులలోనే వర్తిస్తుంది. అంటే సెక్షను 376 (2) లో (ఎ), (బి), (సి), (డి), (ఇ), (జి) లకు మాత్రమే చెల్లుతుంది. అంటే పోలీసు ఆఫీసర్లు, ప్రభుత్వోద్యోగులు, జైలు అధికారులు, ఆస్పత్రుల అధికారులు సెక్షనులో చెప్పిన పరిస్థితుల్లో నేరం చేసినపుడు, లేక ఎవరైనా గర్భిణీ స్త్రీని మానభంగం సినపుడు, లేక అనేక మంది స్త్రీని మానభంగం చేసినపుడు, ఈ సూత్రం వర్తిస్తుంది.

12 సంవత్సరాల లోపు బాలిక మానభంగం చేయబడినపుడు దీని ప్రసక్తి రాలేదు. ఎందుకంటే 16 సంవత్సరాల లోపు వయస్సుకల బాలిక సంభోగానికి సమ్మతించినా పురుషుడు నేరం చేసినట్లేనని సెక్షను 375లో పూర్వమే వ్రాసి పెట్టబడియున్నది. ఈ సూత్రం పూర్వం కన్న మెరుగు. స్త్రీ యొక్క వాఙ్మూలాన్ని యథాతథంగా సత్యంగా స్వీకరించాలని మహిళా సంఘాలు కొన్ని కోరుతున్నాయి. 'ఏ స్త్రీ తను మానభంగం చేయబడినానని సాధారణంగా చెప్పుకోదు' కనుక అలాంటి సవరణ అవసరమని వారి అభిప్రాయం.

## ఆత్మరక్షణోపాయాలు

స్త్రీలోకం వాదనలతో సరిపెట్టుకో దలచుకోలేదు. ఆత్మరక్షణోపాయాలను అన్వేషించింది. బ్రిటనులో జాకీ హడ్సను అనే ఆమె 'బ్రిటిష స్త్రీల ఆత్మరక్షణ సంఘం'ను స్థాపించింది. పోలీసులదాకా పోకుండా దుర్మార్గ పురుషుల దాడి నుండి ఎలా రక్షించుకోవాలో ఆమె నేర్పుతుంది. బర్మింగ్‌హాం, బ్రిస్టల్ మొదలైన 25 నగరాలలో అనుబంధ క్లబ్బులున్నాయి ఆ సంఘానికి. "మామూలుగా ఆ పరిస్థితిలో స్త్రీ నిశ్చేష్టురాలవుతుంది. అలా కాకుండా దాడి చేసే పురుషునిపై ఆమే మొదటిదెబ్బ తీయాలి. అతడు తేరుకునేలోగా ఆమె పారిపోవాలి. ఇదంతా కత్తి, తుపాకీ చేతనున్న దుర్మార్గుని పక్షంలో వర్తించదు. కాని ఎక్కువ మంది ఆయుధాలతో రారు. దాడికి గురి అయ్యే స్త్రీలను తెలిసినవారే ఆ దుర్మార్గానికి పూనుకుంటారు సాధారణంగా." ఇదీ ఆమె సలహా. ఆమె శిక్షణ కాలపరిమితి 12 గంటలు మాత్రమే. ఇలాంటి శిక్షణ ఆ సందర్భంలో ఉపకరించినా, ఉపకరించకపోయినా స్త్రీకి నైతిక ధృతిని ఇస్తుంది. ధైర్యసాహసాలున్న స్త్రీ ఆ పరిస్థితికి అనుగుణంగా సంచరించి ముప్పు తప్పించుకోగలదు. ఈ పరిస్థితుల్లో ఏం చేయాలో మహాత్మాగాంధి సలహా ఇచ్చారు నారీలోకానికి. వారు ఎల్లప్పుడూ విష గుళికలను కొంగున ముడి వేసుకోవాలట. మాన సంరక్షణానికి మరో ఉపాయం లేకపోతే వాటిని మింగి తమ పరువు కాపాడుకోవాలట స్త్రీలు మహాత్మాగాంధి సలహా కన్నా జాకీ హడ్సను సూచన మెరుగైనది; ఆచరణ యోగ్యమయినది.

మనదేశంలో అనేక మహిళా సంఘాల సమావేశాలలో 'స్త్రీకి భద్రత' అనే అంశంపై చర్చలు సాగుతున్నాయి. బాలికలకు 'కరాటే' నేర్పాలని సూచనలు వస్తున్నాయి. ప్రభుత్వ యువజన సేవా సమితివారు 'కరాటే' శిక్షణలకు సహాయం చేస్తున్నారు. కరాటే నేర్చుకున్న స్త్రీ ఒక్కతే అవలీలగా నలుగురైదుగురు పురుషులను ఎదిరించి పోరాడకలదు. దుండగుల కీళ్ళు విరగ గొట్టకలదు. ఈ పోరాటంలో ముఖ్యంగా కావలసింది మనోనిబ్బరం. దుర్మార్గుని దాడికి భయపడకుండా స్త్రీ ఎదురుతిరిగి ఎదురుదాడికి సన్నద్ధమయినపుడు వాడు పరారవుతాడు. వస్తుతః వాడు పిరికివాడు. తగవు పడటానికి సిద్ధం కాడు. బెదిరిపోయిన ఆడమనిషిపై అఘాయిత్యానికి పూనుకుంటాడు తప్ప ప్రతిఘటన ఉంటుందని తెలిస్తే పారిపోతాడు.

## మానభంగాల కేసులు : మహిళోద్యమ కార్యకర్తలు

'రేప్' కేసులు మహిళోద్యమ కార్యకర్తల దృష్టిని ఆకర్షించటానికి కారణాలనేకం. స్త్రీలపై శారీరకహింస, మానసిక దౌర్జన్యం, న్యూనతగా చూడటం, వ్యక్తులుగా జీవించడానికి రక్షణ భద్రతలేమి, తత్ఫలితంగా పురుష దురహంకార సమాజం వారిని వంట ఇంటిలోనికి నెట్టివేసే ప్రయత్నాలు ఇవన్నీ స్త్రీ ప్రపంచాన్ని కలవర పరుస్తున్నాయి. వారి ఆగ్రహావేశాలను ప్రముఖ రచయిత్రి సూసాన్ బ్రౌన్ మిల్లరు "Against our will: Men, Women & Rape" అనే గ్రంథంలో చిత్రించారు. "లైంగిక తృప్తికోసం మానభంగాలు చేయటం లేదు పురుషులు. స్త్రీలను బెదిరించి లొంగదీసుకోవ టానికి పథకం ప్రకారం చేసే అమానుషమయిన స్త్రీ వ్యతిరేక దృక్పథంతో సాగించే దుర్మార్గం అది." సూసాన్ యొక్క సూత్రీకరణం ఇది. భూస్వామ్య వ్యతిరేక పెట్టుబడిదారీ వ్యతిరేక పోరాటాల్లో అగ్రగాములుగా ఉండే స్త్రీలపై అత్యాచారాలు ఇందుకే జరుగుతున్నాయి. వ్యవసాయ కార్మికోద్యమంలోని స్త్రీ కార్యకర్తలు ముఖ్యంగా ఈ దాడులకు గురి అవుతున్నారు.

మరో వ్యాఖ్య ఇలా సాగింది. 'మానభంగానికి గురిఅయిన స్త్రీ కాలి నడకన దేశాటనం చేస్తున్నందున ఆమె నేరాన్ని పరోక్షంగా ప్రోత్సహించిందని అభిప్రాయపడి ఒక బ్రిటిష న్యాయమూర్తి నేరం అంగీకరించిన నిందితునికి జరిమానా మాత్రం వేసి వదలి పెట్టాడు. అంతే సౌదీ అరేబియాలో వళె

స్త్రీలు ముసుగుతో తిరగాలా? లేక ఇంట్లో మూలపడి ఉండాలా? లేక ఇతరు లతో ఏ విధంగాను కలవకుండా వేరుగా ఉండాలా? ఈ ప్రశ్నలు ఉద్భవిస్తు న్నాయి. దాంతో మానభంగాల సంఖ్య విపరీతంగా అంటుజాడ్యంలా పెరిగి పోతున్నది. ఎప్పటికప్పుడు శాసనాలను మార్చడానికి కమిటీలు వేయడం, నివేదికలను సమర్పించడం మామూలు అయింది. కమిటీల నిండా పురుషులు; జాగు చేస్తారు వారు. పురుష న్యాయమూర్తులు నిందితులను వదిలి వేస్తారు. నిందితులకూ తెలుసు, పురుష పుంగవులు అన్నిచోట్ల తమకిని ఆదుకుంటారని. అందువల్లనే వారు యథేచ్ఛగా ప్రవర్తిస్తున్నారు నదురూ బెదురూ లేకుండా. దీనిని ఆపటానికి ఒకటే మార్గం. అది అందరికీ తెలుసు. నిందితులకి మర్మావయవ విచ్ఛేదం శిక్ష వేస్తే ఈ నేరాలు ఆగిపోతాయి.''

శిక్ష విషయంలో భేదాభిప్రాయాలుండవచ్చును. పైగా నిందితుడు వివాహితుడా అవివాహితుడా అనే దానినిబట్టి కూడా ఇలాంటి శిక్షయొక్క ఔచిత్యం ఆధారపడుతుంది. వివాహితుడికి ఇలాంటి శిక్ష వేస్తే ఆ శిక్ష అతని భార్యకు వేసినట్లు కాదా? ఈ ప్రశ్నలను ప్రస్తుతానికి వదిలివేస్తే వ్యాఖ్యలోని తతిమ్మా ఆలోచనా ధోరణి చాలా సబబుగా ఉంది. అప్రతిహతమైన భావాలు అవి; ఆమోదయోగ్యాలు సర్వత్రా.

మహిళా ప్రపంచమూ, సహృదయులూ స్వేచ్ఛా కాముకులూ అయిన పురుషులూ ఈ మానభంగాల వెనుక దాగిఉన్న దురహంకార మనస్తత్వాన్ని, దౌర్జన్య విధానాన్ని, హింసా పద్ధతినీ సర్వవిధాలా ఎదుర్కోడానికి కృషి చేయటం అవశ్య కర్తవ్యం.

# అశ్లీల సాహిత్యం

ఇటీవల మనదేశంలో కూడ అశ్లీల సాహిత్యం విపరీతంగా ప్రచురిత మవుతున్నది. సెక్సుకు సంబంధించిన విద్యను పాఠశాలల్లో, కళాశాలల్లో బోధించనపుడు, ఆ సమాచారం విద్యార్థులకు దొరకనపుడు, యువతకు అందుబాటులో లేనపుడు వక్రీకరించబడిన సెక్సు సమాచారాన్ని అందించే అశ్లీల సాహిత్యం ఉద్భవిస్తుంది. డిమాండు ఉన్నచోట సరుకు తయారు అవుతుంది. అది వ్యాపార సూత్రం. అదే ఈ రంగంలో జరుగుతున్నది. రైళ్ళలో, బస్సు స్టేషనులలో, ప్లాటుఫారాలమీద, చిన్న చిన్న బంకులలో ఈ రకం సాహిత్యం బాగా అమ్ముతున్నారు. ఎంత ధరఅయినా పెట్టి యువతీ యువకులు కొంటున్నారు. ఇది చిన్న వ్యాపారంగా ఉంది భారతదేశంలో. కాగా భారీ పరిశ్రమకు కావలసిన హంగులులేవు. అమెరికా, బ్రిటను ఫ్రాన్సు లలో లాగ 'సెక్సుషాపు'లు లేవు భారతదేశంలో. బ్లూ ఫిలింల ప్రదర్శనలు లేవు బహిరంగంగా. పై చెప్పిన దేశాలలో డాలరో లేక అరపౌనో చెల్లించిన వారికి 3 నిమిషాలు స్త్రీ పురుష సంభోగ దృశ్యాన్ని ఆ దుకాణంలో విడిగా ఒక అరలో కూర్చొని చూచే అవకాశం ఉన్నది. ఆ అరలో ఇద్దరు కూర్చో టానికి ఆసనాలు ఉంటాయి. అలా చూచేవారిని పోలీసులు అరెస్టు చేయరు; చేయటానికి 'లా' అంగీకరించదు.

అమెరికాలో అశ్లీల సాహిత్యం ఈనాడు విపరీతంగా పెరిగిపోయింది. వారి రాజ్యాంగంలో పత్రికాస్వేచ్ఛను స్పష్టంగా ప్రత్యేక వివరణలతో పేర్కొన్నారు దానిని ఆసరాగా తీసుకొని అశ్లీల సాహిత్యాన్ని వెదజల్లు తున్నారు వ్యాపారస్తులు. వారు తమ లాభాలకోసం యువతరానికి తప్పుడు విలువలను అందిస్తున్నారు. తాము మాత్రం కోట్ల డాలర్ల లాభాలను గడిస్తు న్నారు. పొరపాటు సెక్సు ప్రమాణాలను నిర్దేశించి యువతలో అలజడిని

పెంచుతున్నారు. అశ్లీల సాహిత్య పరిశ్రమ ఆనుపానులను గురించి మార్థా లాంగిలిను 'అశ్లీల సాహిత్యం యొక్క ఆర్థికాంశాలు' అనే గ్రంథం వ్రాసింది. ఆ గ్రంథంలో ఉటంకించబడిన కొన్ని భావాలను ఇక్కడ వెంటుపరచటం జరుగుతున్నది.

''నాలుగు డాలర్ల టికెట్టుతో అనేక మానభంగాలను తెరపై చూడ గల అవకాశం ఈనాడు అమెరికా ప్రేక్షకుడికి లభిస్తోంది. స్త్రీలపై ద్వేషం కక్కే ఫిలింలకు తోడుగా అశ్లీల చిత్రాలకు, మామూలు చిత్రాలకు ఉన్న తేడా నశించి పోతుంది.

చిత్రాలు మూడురకాలుగా వుంటాయి. మామూలివి కొన్ని. కొద్దిగా అశ్లీలత వున్నవి మరికొన్ని. పూర్తిగా అశ్లీల చిత్రాలు తతిమ్మావి. మామూలు చిత్రాలలో స్త్రీని లొంగిపోయే వ్యక్తిగా, అణగి మణగి ఉండే వ్యక్తిగా చిత్రిస్తారు. కొద్దిపాటి అశ్లీల చిత్రాలు లైంగిక సంబంధంగా తప్పుడు ప్రబోధాన్ని చేస్తాయి. పురుషుడు ఆధిపత్యం వహించేవాడని, స్త్రీ విధేయురాలిగా లైంగిక విషయాలలో అతనికి అనుకూలంగా నడుచుకోవాలని సూచిస్తాయి. కాని పూర్తిగా అశ్లీల చిత్రాలు, పుస్తకాలు భవిష్యత్తులో మహిళా మానభంగాలకు, స్త్రీలపై అత్యాచారాలకు గడంగ దలచిన వారికి బోధనా గ్రంథాలుగా ఉపక రిస్తున్నాయి. చాలావరకు అశ్లీల చిత్రాలు వర్ణ వివక్షతో నిండి వుంటాయి. నల్లవారిని, వారి స్త్రీలను దూషిస్తూ, నిందిస్తూ వారిని అత్యాచారాలకు పాత్రులుగా చేయడం సబబన్నట్లు సందేశమిస్తాయి ఆ అశ్లీల చిత్రాలు. సెక్సు మలినమని, దుష్టమని, నిషిద్ధమని ప్రచారం చేస్తారు మన సంఘంలో నీతిని నిర్దేశించే పెద్దలు. వారు సంఘంలో మెజారిటీ అని చెప్పుకుంటారు. అది నిజం కాదు. ఏదైనా వారి బోధలు అశ్లీల సాహిత్యానికి పునాదులు వేస్తు న్నాయి. సెక్సు మలినమయింది కనుక స్త్రీలతో పొత్తు అక్కర లేదని ఒక తప్పుడు అవగాహనను పెంపొందించటం జరుగుతున్నది. తద్వారా స్త్రీ ద్వేషం పుట్టుంది. 'సెక్సు మలినం కనుక స్త్రీపై ఎలాంటి దౌర్జన్యమయినా

చెయ్యవచ్చును'' అనేది అశ్లీల సాహిత్య వర్తకుల భాష్యం. ఈ రెండు వైఖరులూ స్త్రీ విమోచనకు ప్రతిబంధకాలే.

అశ్లీల సాహిత్యం కొంతవరకు తన డిమాండును తను పెంచుకుంటున్నది. యువజనానికి లైంగిక ప్రబోధంచేసే బాధ్యత అది తను పుచ్చుకొని - నిజానికి అది అందించేది లైంగిక అవిద్య - ఏది సెక్సును ప్రకోపింపచేస్తుందో, దేనిని సెక్సుపరంగా శ్రేష్టమనాలో నిర్ణయించ పూనుకుంటున్నది. అశ్లీల సాహిత్య ఉత్పత్తి విక్రయాలు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో భారీ పరిశ్రమగా తయారయింది.

స్త్రీ విమోచనవల్ల తమకేదో ముప్పు కలుగుతుందని చాల మంది పురుషులు భయపడు తున్నారు; తమ పురుషత్వానికి ప్రమాదం వాటిల్లగలదని తల్లడిల్లి పోతున్నారు. వీరందరినీ అశ్లీల సాహిత్యపు మార్కెట్టులో వినియోగదారులుగా తయారు చేస్తున్నది అశ్లీల సాహిత్య పరిశ్రమ. ఇటీవల స్త్రీలపై అత్యాచారాలు పచ్చిగా సాగుతున్నాయి. దీనికి కారణం పైన చెప్పిన పురుషుల మనస్తత్వమే. అందుకనే అవి ఎక్కువగా విమోచన పొందిన స్త్రీలపై జరుగుతున్నాయి. స్త్రీలపై పెత్తనం చెయ్యాలని, వారిని లొంగదీయాలనే కాంక్ష వారిని అవమానింప చేస్తున్నది. స్త్రీ శక్తిని చూస్తే భయం, స్త్రీలను అదుపు చేయాలనే ఆకాంక్ష, వారిపై కక్ష సాధించాలనే కోరిక ఈ మూడూ అత్యాచారాలకు ప్రేరకాలు.

ఈ పరిశ్రమలో పనిచేసే స్త్రీలు, ఇది పోషించే దౌర్జన్యానికి బలి అయ్యే స్త్రీలు, ఇది బలపర్చే పురుషాధిపత్య సమాజంలో బ్రతకవలసిన స్త్రీలూ వీరందరిని ఈ పరిశ్రమ దుష్టంగా అణచి వేస్తున్నది. ఈ పరిశ్రమ విక్రయించే భావాలను గురించి స్త్రీ విమోచనకారులు దూరదృష్టితో, సునిశిత దృక్పథాలతో గమనిస్తున్నారు. స్త్రీలకు వ్యతిరేకంగా ఆ పరిశ్రమ పనిచేస్తున్నదనేది నగ్న సత్యం. మానభంగాలకు గురి అయినవారిని ఆదుకునే కేంద్రాలకు, హింసకు గురిఅయిన స్త్రీలకు ఆశ్రయమిచ్చే కేంద్రాలకు, వైద్యసలహా

కేంద్రాలకు, సామాజిక సేవా సంస్థలకు రీగన్ ప్రభుత్వం ధన సహాయాన్ని చాల ఎక్కువ మోతాదులో తగ్గించి వేసింది. అదే సమయంలో స్త్రీలపై హింస, దౌర్జన్యం పెరుగుతున్నాయి. ఇంట్లో, వీధిలో, ఉద్యోగ ప్రదేశాలలో స్త్రీలు అలాంటి ప్రమాదాలకు గురి అవుతున్నారు. స్త్రీ జీవితంలో మాన భంగం చేయబడటానికి అవకాశం మూడింట ఒకటి కాగా, భర్తచేతనో ప్రియుని చేతనో చెప్పుదెబ్బలు తినే పరిస్థితి నాల్గింట ఒకటిగా తయారయింది. ఉద్యోగ ప్రదేశంలో 100 కి 80 మంది స్త్రీలు ఏదోరకమయిన లైంగిక వేధింపుకు, చీకాకుకు లోనగుతున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో సంవత్సరానికి కనీసం ఒక లక్షమంది బాలికలు ఇళ్ళల్లో తమ దగ్గర బంధువులచేత బలాత్కారింప బడుతున్నారు; ఏదో రకమయిన లైంగిక ఇబ్బందులకు లోనవుతున్నారు. ఇలా స్త్రీలను లైంగిక హింస చుట్టుముట్టింది సర్వే సర్వత్రా. ఈ సందర్భంలో అశ్లీల సాహిత్య వ్యాపారస్తులు పురుషులలో యుద్ధ మనస్తత్వాన్ని పెంపొందిస్తున్నారు. స్త్రీలపై మానభంగాలు, దౌర్జన్యాల సంస్కృతి నుండి లాభించటం, స్త్రీల శరీరాలపై, బాలికలపై అత్యాచారాలను సమర్థించటం, ఇవి ఆ పరిశ్రమచేసే నీచకార్యాలు. స్త్రీలు ఈ పరిశ్రమతో ఢీకొనవలసిన తరుణం ఆసన్నమయింది."

ఇదంతా అమెరికాను గురించి రాసిన విషయం. అశ్లీల సాహిత్యం అమెరికాలో తయారు అయినంత భారీ ఎత్తున లేదు మనదేశంలో. పచ్చిగా ఉన్న సాహిత్యం రహస్యంగా పంపిణీ అవుతున్నది. పూత మెరుగులతో నిండి ఉండేది మన సినిమాలలో ప్రత్యక్షమవుతున్నది. స్త్రీ ద్వేషాన్ని పెంచుతున్నది. స్త్రీని వస్తువుగా చిత్రించి, ఇష్టంవచ్చినట్టు వాడుకోమన్నట్లు ప్రోత్సహిస్తున్నది యువకులను. ఏదయినా, మౌలికమయిన భావాల విషయంలో అమెరికాలోని పరిస్థితికీ, భారతదేశ స్థితిగతులకూ తేడా లేదు.

భారత దేశంలో అశ్లీల సాహిత్యాన్ని నిషేధిస్తున్నారు పుస్తకాల రూపంలో. అలాగే భారతదేశ చిత్రాలలో అశ్లీలతను ప్రదర్శించే 'సీనులను' కత్తిరిస్తున్నామని చెప్తున్నారు 'సెన్సారు' బోర్డులవారు. అయినా పాశవికతను

రేకెత్తించే దృశ్యాలు కల సినిమాలకు సెన్సారు బోర్డుల అనుమతి సర్టిఫికేట్లు లభిస్తున్నాయి. ద్వంద్వార్థాలుకల మాటలు, సరేసరి; కోకొల్లలు కొన్ని సినిమాలలో. భారత దేశ సంస్కృతిని గురించి తెగ పొగుడుకుంటూ అశ్లీల దృశ్యాలున్న విదేశీ చిత్రాలను విరివిగా దిగుమతి చేయనిస్తున్నది ప్రభుత్వం. ఈ ద్వంద్వ నీతి, కాదు ఈ కుటిల నీతి, ఏమిటో ఎవరికీ అర్థం కాదు.

విజ్ఞాన శాస్త్ర సాహిత్యం వేరు. అశ్లీల సాహిత్యం వేరు. విజ్ఞాన శాస్త్రాలు జ్ఞానాన్ని పెంపొందిస్తాయి. విషయ గ్రహణం చేసిన వ్యక్తి వివేచనతో వ్యవహరించ గలుగుతాడు. అశ్లీల సాహిత్యం మనిషిని పశువును చేస్తుంది. తప్పుడు సమాచారాన్ని అందించి, లోప భూయిష్టమైన విలువలను బోధించి, మనిషి వివేకాన్ని పారద్రోలి, ఉద్రేకిని చేస్తుంది అశ్లీల సాహిత్యం. సెక్సు ప్రబోధం విజ్ఞానశాస్త్ర ప్రాతిపదికపై జరిగితే అది అశ్లీలం కాదు. వాస్తవాన్ని మరుగు పరచి నకిలీ విలువలను మనకు అందించేది అశ్లీల సాహిత్యం. కామ శాస్త్రాన్ని అధ్యయనాంశంగా స్వీకరించారు మన పూర్వీకులు. సెక్సును నిర్లిప్తంగా శాస్త్ర దృష్టితో పరికించారు. ఈనాడు ప్రతిదీ భారీ వ్యాపారమో లేక పరిశ్రమో అవుతున్నది. లాభదృష్టి తప్ప మరొకటి లేదు. ఈ లాభాల వేటలో ఎవరు నశించినా వారికి పట్టదు. అదే ఈనాడు అశ్లీల సాహిత్య సృష్టిలో, అశ్లీల చిత్ర నిర్మాణంలో సాగుతున్నది.

స్త్రీ విమోచనోద్యమానికి అశ్లీల సాహిత్య పరిశ్రమ బలమయిన శత్రువు. కాగా, దీనిని ఎలా ఎదుర్కోవాలనే విషయంలో, ఏది అశ్లీలం, ఏది అసభ్యత అనే అంశంపై అభిప్రాయ భేదాలు ఉన్నాయి; ఉంటాయి కూడాను. ప్రజాస్వామ్య సమాజం ఈ సమస్యను ఒక రకంగా పరిష్కరించ పూనుకుంటే, నియంతృత్వాన్ని కాంక్షించేవారు మరోరకంగా ఆలోచిస్తారు. తేడా ఆ విషయంలోనే. ఒకటి మాత్రం సత్యం. స్వేచ్ఛ, సమానత్వం సౌభ్రాతృత్వం లాంటి విలువలపై ఏ మాత్రం గౌరవం కల వ్యక్తి అయినా స్త్రీ విమోచనోద్యంపై ఈ అశ్లీల సాహిత్యం-ప్రత్యక్షంగాను పరోక్షంగాను-చేసే దాడిని త్రిప్పికొట్టడానికి ఉద్యమించాలి. దీనిని కనీస కర్తవ్యంగా భావించక తప్పదు.